**THIS LITTLE PRODUCTION**

**is**

**WITH DEEP SYMPATHY**

**Most lovingly dedicated**

**TO ALL THOSE**

THAT HAVE LAID DOWN THEIR LIVES

in the service of

THE WORLD WIDE HORRID

EUROPEAN WAR

**to deside the fate**
of

THIS PITEABLE WORLD

with Complete victory to the allies

*The English, The French, The Americans,*

&

*THE INDIANS.*

WITH THE STRONGEST FAITH

in

GOD AS LOVE & MAN AS BROTHER




BI DIDAS, CIGARETTE ROW, THRITHWAM & SCOUTS.

బీడీదాస్, సిగరెట్ రావ్, త్రిత్వము, స్కౌట్లు.

# విజ్ఞాపనము.

ఈ లోకమునఁ, ధర్మాధర్మపరిజ్ఞానధురంధరులును, శాంతాత్ములును, దయార్ద్ర హృదయులును, నిరంతర పరోపకారపరాయణులును, నగు మహాత్ములు, మరణానంతరమున, మృతజీవులని, యెల్లవారలచేతను, బరిగణింపఁబడు చుండుట సుప్రసిద్ధంబకదా!

మృతజీవుం డనియే, చెప్పవలసిన భరతుఁ డను రాజచంద్రుండు పరిపాలించిన యీహిందూ దేశంబున కదృష్టవశముచేతనే, నిశ్చయముగా నీశ్వరేచ్ఛవలననే, దూరదృష్టి విరాజితంబును, శక్తిసంపన్నంబును నగు నింగ్లీషు ప్రభుత్వము లభించియున్న దని, ముమ్మాటికిం జెప్పవలసి యున్నది.

శాంతిసుఖంబుల కావాసం బగు నీప్రభుత్వంబు కలిమిచేతనే, దేశ మనేకవిధంబుల, నభివృద్ధినిం గాంచు చున్నది. లోకములోఁ గల యన్ని విషయంబులలో, నారోగ్యవిషయమే, సర్వోత్తమ మయిన దని, చక్కఁగా గ్రహించి, మనదొరతనమువారు, సంవత్సరమున కొకవారము, "ఆరోగ్యవారము" గా, దేశములోని బాలబాలికాపాఠశాలలు, పరిగణించు చుండునట్లు లోకశాసనము నేర్పరచి యున్నందుల కెంతయు సంతసింపవలసియే యున్నది.

ఏతత్సందర్భంబున, సుఖాధారార్యంశములెన్నియో కలిగి యుండునట్టుల్ చిన్నసంభాషణ పుస్తకము వ్రాయఁబడి యున్నది. ఇందలి కొంతభాగము, మాపాఠశాలయందలి విద్యార్థులచేఁ జక్కఁగా, నానందజనకంబుగఁ, బ్రదర్శింపఁబడి యున్నది.

ఇందలి యనేకాంశంబులలో, నేయొక్కయంశ మైన, నేయొక్క చదువరి కైన, నించు కైనను, మేలుఁ జేయఁ గలిగినచో, నాపడినప్రయాసము వృథ కాలేదుగదా యని సంతోషించు చుందు నని తెలియఁ జేయుచున్నాఁడను.

విద్యాశాఖవారును, పాఠశాలలయందలి యుపాధ్యాయులును, బాలురును, బాలికలును, దీనికిం దగినప్రోత్సాహము గలిగించెదరని హృదయపూర్వకముగా నమ్ముచున్నాఁడను.

1—1—1930,
ఆర్యాపురము,
రాజమహేంద్రవరం } తోలేటి వెంకటసుబ్బారావు.



# కృతిపతిప్రశంస

గీ. భాసురం బగుచుండు విజ్ఞానభాస్కరంబుఁ,
కరము భీతిగఁ బశ్చిమఖండమందు,
జరగి యున్నట్టి భీకరసమరమందు,
దయయె దైవంబు, నరుఁడె సోదరుఁ డనుకొని,
సంతసంబుగ, లోకంబ శాంతికొఱకె,
పూని, ప్రాణముల్, ధారగాఁ బోసినట్టి
ధర్మపరులకు, నాదుసోదరుల కెల్లఁ,
బరమశాంతుల కానీరవరుల కెల్ల,
డింపుపడకుండ, నామది యుంచుఁ, బ్రేమ
నింపఁ, గృతి నొసంగెదఁ, గృతజ్ఞుండ నగుచు.



# జ్ఞానభాస్కరము.



## మొదటి ప్రకరణము.



ప్రదేశము:—తమాషాపట్టణము.

ధనాలధర్మాలసెట్టిగారి మేడ.

ఆరోగ్యరావు ప్రవేశించుచున్నాఁడు.

ఆరోగ్యరావు—ఆహా! నా కెంత యారోగ్యముగా నున్నది! ఎంత సంతోషముగా నున్నది! బాగుగాఁ జదువుకొను చున్నాను. బాగుగా నాడుకొను చున్నాను. ప్రతిరోజుపాఠము లారోజుననే చదువుకొను చున్నాను. ఉదయముననే లేచి, కంఠస్నానమో, శిరస్స్నానమో చేసి, శ్రద్ధగాఁ జదువుకొనుచున్నాను. ప్రతిరోజును, మానకుండ, బడికి వెళ్లుచున్నాను. ఉపాధ్యాయులు చెప్పినసంగతు లన్నియు బాగుగా శ్రద్ధగా వినుచున్నాను. పుస్తకములలో వ్రాసికొని, [illegible] మాత్రమేకాక, చదువుకొను చున్నాను. ఎప్పటిపను లప్పుడు తప్పకుండఁ జేసికొను చున్నాను. అల్లరిపను లేవియుఁ జేయకుండ నున్నాను. చక్కఁగాఁ జదువుకొను మంచినడవడిగల పిల్లల తోనే సహవాసముచేయుచున్నాను. దస్తూరి బాగుగాఁ గుదురు నట్లు తప్పకుండఁ బ్రతిరోజును, ఇంగ్లీషు తెలుఁగుకాపీలు అనమము, ఒక్కొక్కటి యైనను, వ్రాసికొను చున్నాను.

ఇంక నా కేమి కావలెను? పెద్దపరీక్షలో నీయేడు గూడ తప్పకుండ జయమునే పొందెదను. మాతల్లిదండ్రులు, మా యుపాధ్యాయులు, మాస్నేహితులు, అందఱును, సంతోషించెదరు.

ఇదిగో! సిగరెట్ రావు, బీడీదాసు, త్రిశ్వముగాడు, ఇంక నితరస్నేహితులు, చాలమంది వచ్చి యున్నారు. భరద్వాజుడు, కోకిలరావు, నింకను రాలేదు. తారకరామ్ టోపీదాసు రాకపోయిన యెడల, సభకు గౌరవమే యుండదుగదా!

బ్రదర్స్! మనము, "జ్ఞానబోధకసమాజము" స్థాపించియున్నాముగదా! మన మేకార్యమైన నారంభించునప్పుడును, ముగించునప్పుడును, దైవప్రార్థన తప్పక చేయవలయును. నిజ యసంసిద్ధికి, మన మందఱమును, నిలువఁబడి, కన్నులు మూసికొని, కొంచెముసేపు. వ్యాసమహాప్రార్థనముగా, నా యనుకరుణా కటాక్షమునకై సదేప్రార్థనా [illegible], ప్రార్థన చేయవలసి యున్నది.

ఆ [illegible], [illegible], [illegible], [illegible] [illegible]. [illegible], [illegible] [illegible]. [illegible] నిశ్చయము [illegible] నిశ్చయము.

అందఱు——నిలువఁబడి, కన్నులుమూసికొని యున్నారు.

ఆరోగ్య——లేచి, కన్నులు మూసికొని, స్వయంభువుండవును, సంపూర్ణజ్ఞాన స్వరూపుండవును, సర్వశక్తిసంపన్నుండవును, పరమ కరుణానిధివియును, సర్వవ్యాపివియును, అగు నో పరమేశ్వరుండా! ఇదె మాయొక్క భక్తిపూర్వకము లైన యనేకనమస్కారములు. పిపీలికాది బ్రహ్మపర్యంతమును గల సర్వప్రపంచమును

విలాసార్థముగా సృజించి, నిరంతర కృపాతరంగితాంతరంగంబునఁ గాపాడుచుఁ, గతిశాసనంబులు శాసించి, సూర్యచంద్రాది గ్రహములును, పంచభూతంబులును, సర్వంబును, అణుమాత్రం బును, గ్రమము దప్ప కుండునట్లుగాఁ, దమతమనియమితకార్యం బులు, చక్కఁగా నెరవేర్చుకొనుచుండునట్లుగా, నత్యంతాద్భు తావహంబుగ, నడపించుచున్న నీకనేక కృతజ్ఞతా పూర్వకము లయిన వందనంబులు సమర్పించు చున్నారము.

పాపులమును, దీనులము నైన మమ్ముఁ గరుణఁ జూచి, రక్షింపఁ బదింబదిగఁ బ్రార్థించుచున్నారము. లేశమాత్రంబును, నీ కరుణలేక, మే మేకార్యంబు నయినను, జేయఁ జాలము.

ఈలోకములోఁ, గొందఱు మూఢాత్ములు, అజ్ఞానాంధకారనిమగ్నమానసు లయి, కన్న గానక, తామే సర్వజ్ఞుల మనియు, సర్వంబునకుఁ దామే కర్తల మనియు, విఱ్ఱవీఁగు చుండుదురు. అట్టి గర్వాంధకారులను, మనుష్య లోకంబులను, నాశనింపక యుండు నట్టి నీ నిగ్రహమును ప్రశంసాపూర్వకముగా వేడికొను చున్నారము.

త్రిత్వము—అయ్యో! నాజీవితకాలములో, నే నెన్నఁడును, ప్రార్థించినదే యుండలేదు. ప్రార్థన లాత్మబోధ లనియే నమ్ము చుండెడువాఁడను. ధ్యానము సోమరితనమనియే యెంచు చుండెడువాఁడను. ప్రార్థనలాలకించువాఁడు, దేవుఁడనువాఁడొ కఁడు లేనేలేఁడనుకొనుచుండెడువాఁడను. అయ్యో! నే నెంతపా పాత్ముఁడను. మనయారోగ్యరావు ప్రార్థన వినినప్పటినుండియు,

నామనస్సా పరమపావనుం డగుదేవునివైపున కాశ్చర్యకరంబుగ నాకర్షింపఁబడు చున్నది. ఆహా! సర్వార్థప్రదాయక మగు ప్రార్థనయం దెంతబల మయిన నున్నదిగదా!

ఆరోగ్య—ఔను. మనత్రిత్వము చెప్పినట్లు ప్రార్థనయం దెంతబల మైన నున్నది! అది సత్యము. ముమ్మాటికిని సత్యము. అది హృదయపూర్వకముగాఁ బ్రార్థించువారిమనస్సులకే తెలియవలెను. వినుండు నేను జెప్పఁబోవుసంగతులు. అదంతయు దేవునిదయవల్లనేకదా కలుగు చున్నది! మన మప్పుడప్పుడు, మంచిమంచిసంగతులనుగుఱించి, మాట లాడు చుండినయెడల నది మనకు చాల మేలు చేయునుసుమా!

బీడీదాస్—ఔనురా! మనకే కాదు. చిన్నవారి కందఱికిని గూడఁ, జాల ఉపకారము చేయకమానదు.

సిగరెట్ రావు—ఈరోజున నేవిషయమునుగూర్చి మాటలాడునది

ఆరోగ్య—ఏవిషయమా? లోకములోఁ గలయన్నివిషయములలోను, మిక్కిలి ముఖ్య మైనది ఆరోగ్యము అని నీకుఁ దెలియదురా? దానినిగుఱించియే మాటాడుదము.

బీడీదాస్—ఆరోగ్య మన నేమిటిరా?

ఆరోగ్య—ఆరోగ్య మనినఁ దెలియదురా? థర్డుఫారములో రెండవయేఁడుగూడ నేర్చుచున్నావు. మూఁడవయేఁడుగూడ, ముచ్చటగా నాటలతోను, బాటలతోను, జరపుకొను చుందువు కాఁబోలు! ఏమియు రోగము లేకుండ, శరీరములోను, మనస్సులోను, నెమ్మదిగా నుండుటయే యారోగ్యమురా!

స్త్రీత్వము—అబ్బో! వీళ్లందఱు పోగుపడి, మహా ఆర్గై నైజ్డ్ బాడీ వలె పెద్దసభచేసి, యేవో లోకమంతయుం దల్లక్రిందుచేసి, లోకులసొమ్ము గుల్ల చేసి, యుద్ధించునట్లు, టాక్ చేస్తున్నారు. ఏమున్నది?

చప్పట్లు వింటారు. గుసగుసలు వింటారు. పకపకలు చూస్తారు. కొంత వినఁబడుతుంది. కొంత వినఁబడదు. వినువారిమనస్సులలో, బాగుగా నాటుకొనవలయు నని, చేతులు తిప్పుకొంటారు. కాళ్లు తిప్పుకొంటారు. బల్లలమీద గుద్దుతారు. కుర్చీలు ముందుకు, వెనుకకు, లాగుతారు. ఉపమాలు తింటారు. కాఫీటి తాగుతారు. కిల్లీలు వేస్తారు. గంటో, రెండుగంటలో, నాలుకలు చీలిక లగునట్లుగా, ఏవేవో! ఒకచెత్త, విన్నదో! చెప్పనిదో! చెప్పెదరు. ఉస్సంటారు. బెల్ కొట్టుతారు సైలెన్స్ ప్లీజు అంటారు. వాచీలు చూసుకొంటారు. ఏదో! ఎంతో! చేసినామని, యిటుఅటు తిప్పుకొనుచు నెవరియింటికి వారు దయచేసెదరు. తరువాత నెవరియాటలు వారాడుకొనుచుందురు. ఇంతయేరా మీ మీటింగులు, ఓహోహో! దేశములో నందఱును లెక్చరర్లే అయిపోవుచున్నారు. అందఱును ఆరేటర్లే అయిపోవుచున్నారురా! ఆహా! దేశము ఆసేతు హిమాచల పర్యంతము కాలక్షేపమునం దెంతయభివృద్ధి పొందుచున్నదిరా!

ఆరోగ్య—నీ వీలాగు డిస్టర్బింగుగా, డిజానరింగుగా, లాఫ్ చేస్తూ, సత్యమైనప్పటికి, పెర్ఫెక్ట్ ట్రూత్ అయినప్పటికి, మాటాడఁ గూడదు.

బీడీదాస్—ఓస్సీ! ఎంతవాఁడ వయినావురా? ఆరోగ్యరావూ! నీచమత్కారపుమాటలు నీకే తగునురా! నీకెంత తెలివైన నున్నదిరా! దేశములో నీలాగుఁ దిరిగి, టక్కరిమాటలు చెప్పి, పాపము! అమాయకు లయినజనులనుండి, డబ్బాంతయు నను, లాగుకొని నీకెంతయిన నున్నదిరా! విను. నీ వేమి యారోగ్యముగా నున్నావు? ఊరక పైకి లావుగ నిద్దుర లాగున నున్న యెడల ఆరోగ్య మనుకొన్నావురా? అది బల మనుకొన్నావురా! ఏదీ నాతో ఆడు, పోట్లాడు, పరుగెత్తు, తిను. నిద్రపో, చదువు చూతము. నేను చదివిన పుస్తకముల రాయిలాగే చదువుతానురా! నీయారోగ్యము మొద్దులాగునే యున్నది. చూడుము. (అని రెండుచేతులలోను రెండు బీడీలు పుచ్చుకొని గుప్పుగుప్పున కాల్చుచున్నాఁడు.)

సిగరెట్:—ఈలాగు మీరు త్రుంచేస్తు చేస్తూంటే నాకువాళ్లు మంటవేస్తున్నదిరా! ఎప్పురి మినిట్ నాకు థౌజెన్డ్ రూపీస్‌రా! ఏమనుకొన్నావు? కాలముయొక్క విలువ కొంచెమయినను, తెలియకుండ కొట్టుకొంటూ ఏడుస్తున్నావు!

బీడీదాస్:—ఓసీ! సిగరెట్ రావూ! ఎక్కడిదిరా నీకీ డబ్బు? పెట్టిమీద పెట్టి, రకరకాలసిగరెట్లు, రాత్రి, పగలు, అనక, తగలవేస్తూ ఉంటావు.

సిగరెటురావు: హాఁ ఎక్కడిదో! పుస్తకముల కనియు, స్కూలుఫీజు కనియు, హోటలు కనియు కోట్ల కనియు, షర్ట్ల కనియు, చాకలిమంగలికర్చుల కనియుఁ చిల్లరతిండి కనియు,

మాంరెంటు కనియు, మాయూరినుంచి, ప్రతినెలాఖరునబిగ్ మ
నిఆర్డరు వస్తుందిరా. అదిరా రహస్యము. మాఫాదర్ పూర్వకా
లపువాఁడు. మాస్టర్లు రిస్టువాచ్ కొను మని కొట్టు చున్నా రని
న, ఇదిగోరా! ఒకటి కొని యిచ్చి వెళ్లినాఁడు. పాపము మాకు
మాన్యము లున్నవి. అవి తినుచుఁ గూర్చుందురు. ఎప్పుడును
నామీఁదనే దృష్టి పెట్టుకొని యుందురు.

మఱియు సినీమాలు, నాటకములు, సర్కసులు, మ్యా
చీలు, టీములు, బోట్ స్ప్రెర్లు, ఎక్స్కర్షన్లు, ఇంటియొద్దవాళ్ల
కేమి తెలియునురా? సెలవులలో మాయూరికి వెళ్లి, మాటిమాటి
కి, యెస్, నో, మదర్ ఫాదర్ అని యింగ్లీషు మాటాడు చున్న
ప్పుడు, మాఫాదరును, మదరును, ఒకరివంక నొకరు చూచుకొని
అబ్బో! మా పిల్లవాఁడు పెద్దవాఁ డయినాఁడని, చాల సంతో
షించుచుందురు.

తెల్లని చప్పిడబీడీలు. సిగరెట్లురా నాకిష్టమువచ్చినవి! ఎన్నె
న్నిరకములసిగరెట్లు ఏలోపదార్థములవలె మొలకెత్తినవిరా!

బీడీదాస్:—నాన్ సెన్స్. నాబీడీ లంత చెడిపోయినవి
రా? నాబీడీలను, వెధవచప్పిడబీడీ లనెదవురా? బీడీలలో నెన్నెన్ని
మంచిమంచిరకము లున్నవో నీ కేమయినను దెలియునురా? మ
నప్రతిష్ఠముగాను, ఎన్నెన్నిటీములలో, ఎన్నెన్నిప్రైజులు కొట్టినాఁ
డురా! ఎన్నెన్నిటీములలో, నెన్నెన్నితన్నులు తిన్నాఁడురా! ఎ
న్నెన్నితన్నులు తన్నినాఁడురా! ఇదంతయు వానికి నామూఁడీఁ
టివల్లనే, ముఖ్యముగా, నాబీడీలవల్లనే యని యనుచుందును

సిగరెట్.—ఛీ! నోరు ముయ్యి. నాయిష్టమురా. నా సిగరెట్లవతార మెత్తినవిరా? ఓరీ! నీకీబీడీలను డబ్బెక్కడిదిరా

బీడీదాస్:—షట్ యువర్ మౌత్. నాబీడీలను తిట్టుటకు, నీ వెవడవురా? ఎఱుగవురా? మన కనకారావు నాకు ప్రతి రోజునను, ఉదయమున నాలుగుకట్టలు, నూరుబీడీలు, ఇచ్చుచుండును. అవి జేబులో వేసికొని యెక్కడో హోటలులో నేదో విధముగా భోజనముచేసి, స్కూలుకు సొమ్ముపట్టి, యేదియొక సైడ్కో, ఏచౌల్ట్రీలోకో, ఏకాఫీహోటలుకో లేక, మోహిని దేవతాలయములోనికో, యెక్కడికో! నాయిష్టమువచ్చిన చోటికి వెళ్లి, యవియన్నియు సరదాగా గాల్చుకొనుచు, రోజు గడపివేయుదుమురా! మావారలెవరు ఇక్కడ లేరుగదా! ఎవ్వరురా అడిగేవారు? నాయిష్టమురా! నారాజ్యరా!

ఆరోగ్య:—ఫ్రెండ్స్! [illegible] [illegible], దెబ్బలాడుచు నుండరు [illegible]. [illegible] సైలెన్సుగా నుండవలెను.

ఫ్రెండ్లీగా నుండవలెను. జెంటిల్మెన్గా బిహేవ్ చేయవలెను. ఔనురా! నాకును తెలియును, పెద్దపెద్దసభలలోనే, విద్యాధికులే, తిట్టుకొనుచు, గొట్టుకొనుచుం, జెప్పు లెగరవేసికొనుచుందురు. మీరును జూచినారో యుండవచ్చును. వినియేమో యుండవచ్చును కాని, మన మాలాగునం జేయం గూడదు. పెద్దలందఱును, మనమే దేశోద్ధారకులముగాం గావలసినవార మగుటచే,

తేజ మెసఁగంగఁ, గొప్పమరాజునందు,
భక్తివిశ్వాసములె కల్గి, వఱలఁ జనును.

గీ. సత్యవంతునె ప్రేమించు జగము పెన్మి;
సకలసుఖముల నొసఁగును, సత్య మెపుడు;
ధరణి జనులకు, నదియు, యాభరణ మగుట,
విడువఁ జన దెప్డు సత్యంబు; విడువఁ జెడుగె.

గీ. పగలు, రాత్రియు, నన కుండి, బహువిధముల,
సుఖము నేవేళఁ గలిగింపఁ, జూచుచు, సత
తంబుఁ, జింపల మనుతల్లిదండ్రులకును,
దుఃఖ మొసఁగంగఁ జన దింకఁ దుష్టు లగుచు.

గీ. చమపుబాలురయభివృద్ధి, మదిఁ దలఁచక,
పనికిరా నుండువారలుకుఁ, బలుకు చుండి,
కాల మొట్టిరో! వారిగాఁ గడపు చుండు
గురువు లెలంపురు నొందంబు దూషణియుండు.

గీ. చమపుబాలురయభివృద్ధి మదిఁ దలఁచుచుఁ,
గాల మంత ము వృథ యింత గాక యుండఁ,
జదువుఁ జెప్పుచు, నడవడిఁ జక్కఁ జేయు
గురువులందుఁ జూపుఁడు పరమభక్తి.

గీ. తాను పాలించువారలు, దయయు శాంతి,
శాంతిఁ, దన సంతో, శ్రీ కుండి, సాగు చుండు
రాజుమన సెంతో! నిక్కంబ, ప్రజలంగ,
మనుచు నుండగవలయును, మనుజు లెపుడు.

సీ. జీవిజాలములు, నిర్జీవజాలంబులు,
సుఖ మనుభవింపఁ జూచుటలు,
పరమాద్భుతం బగుపంచభూతంబులు,
హాయి నొసంగునాహారసమితిఁ,
బరమసుఖం బందఁ, బంచేంద్రియంబులు,
మానిసం బగుచుండు జ్ఞానధనము,
సొంపు నింపును నుండుసూర్యచంద్రాదులఁ,
బర్వతాదులు, సముద్, నదులు తెన్నొ!
బహువృక్షఫలపుష్పభాసురంబు లై యుగు
తరువులు, లతలను, ధరణి నెన్నొ! నుండు
చిత్రవర్ణంబులఁ జెలఁగి, కూయుచు
ఖగములనెన్నియో కరమువింత,
గీ. నన్ను, నిర్దయ, సృష్టియం దుంచుగాక!
దయ నొసంగెను, మనకెల్ల, దైవ మహహా!
యట్టి దైవంబు, బరమేశు, నాదిదేవంబు,
వేఁడుకొను చుండవలయును, వినతు లిడుచు.
గీ. పగలు పదిలింప నింతయుఁ దగసుసుండె!
పొంచుగా రాత్రి నిద్రను బొందు చుండె,
వేసవగు చుండఁ, బకరను వేగ విడిచి,
కాలకృత్యంబులను దీర్పఁ గరము సుఖము.
గీ. బడికి రా వలెను, మాటలఁ బలుకుచుండు
చెడ్డపిల్లల స్నేహంబె, పొందకుండె,

పరిగఁ బాఠశాలకు వచ్చి చదువుకొనెను
చిన్నవారలస్నేహంబె చెందవలయు.

గీ. మనకుఁ గల్గెడు మిత్రులు, మంచివారు;
చెడ్డవారలు నుండరు; చెడ్డవారి,
మంచిబోధలు చేయుచు, మంచివారు
గాఁగఁ జేయంగ నెయ్యుఁడఁ గడగఁ జనును.

గీ. వంశమందున, గుణముల, బలమునందు,
విద్యయందును, ధనమున, వినయమందు,
ఘనతఁ గను చుండు బాలురఁ గనుచు నుండి
యోర్వలేమిని, లేకుండ నుండవలయు.

గీ. తమకె లాభంబు, మదియందుఁ దలఁచియుకొ!
డెంపమందున, సంతసమునందుకొఱకో!
చేరి, స్తుతులను, మునుమిగఁ జేయుచుండు
వారిస్నేహంబుఁ బొందంగ వలదుసుండి!

గీ. పరుల ప్రాపకంబును దాము పడయ నెంచి,
చిత్రముగ నెన్నొ! మోసముల్ చేయఁ జేరి,
యున్నయవి కొన్ని, లేనివియెన్నొ! చెప్పు
కొండెకాండ్రతో, మిత్రులై, యుండఁ జనదు.

గీ. పలుకు వలననె, మిత్రులు, గలుగుచుంద్రు,
పలుకువలననె, శత్రులు గలుగుచుంద్రు;
కాన, బలుకుతఱిఁ, దెలివిఁ, గలిగి యుండి,
మంచిపలుకులె, పలుకుచు, మనుట సుఖము.

గీ. కాలహరణంబు, నొంతయుఁ, గాంచునటుల,
రేపు రే పంచుఁ, గార్యంబు లాప కుండి,
యెప్పుడు చేయంగవలసిన వప్పుడ యపుడ,
చేయు చుండిన, వ్యసనముల్, చేర కుండు.

గీ. విద్య, జ్ఞానంబుఁ గలిగించు వివిధగతుల;
జ్ఞాన మొందియు, సుఖమును, గలుగఁ జేయు;
సుఖమె, యారోగ్యమున కెంతో! మూలటి యగుటఁ,
బురుషులును, స్త్రీలు, విద్యను, బొందఁ జనును.

గీ. తెలియు, సర్వంబు, నా కంచుఁ దలఁచు చుండు
గర్వ మింతయు, మదియందుఁ, గలుగ కుండి,
యనుభవజ్ఞులు చెప్పెడు సంశయములను,
శ్రద్ధ వినుచుండ మే లెంతో! సంఘటిల్లు.

గీ. మిత్త్రులం బొనర, సచ్చింత, మించఁ గనుము;
శత్త్రులందుఁ గ్రోధంబుఁ, జూపదు మూప;
బీదవారల, నెమ్మోడఁ, బ్రేమఁ గనుము;
చేయుఁ డుపకృతి, ననిశంబుఁ, జింత లెడల.

గీ. పరిహసింపగ వల దెప్డుఁ, బరులఁ గాంచి,
పెద్దవారలు, మూఢులుఁ, బిన్న లనక,
పేదవారలు, ధనికులుఁ, సాదు లనక,
గౌరవంబుగ, నెల్లరఁ, గాంచవలయు.

గీ. పుడమి, మంచినడవడి, సుభాషణంబు;
మంచినడవడి, నరులకు, మహిమ నొసఁగుఁ;

బరిగణింతురు, జను లిలఁ, గరుణాకోడఁ;
గాన, శాంతికే, సర్వోదె, కాంచవలయు.

సీ. రోగ మేదియు లేక, బాగుగా నుండుటె,
యారోగ్య మగుఁజుండి! యవనియందు;
హిత వగునది యెద్ది, మితముగాఁ దినుచుండె,
యారోగ్య మగుఁజుండి! యవనియందుఁ;
పాపచింతల నెట్టుఁ, బాయంగఁ జేయుటె,
యారోగ్య మగుఁజుండి! యవనియందు;
మదికి, సుఖమె కల్గ, మదికె, శాంతియు కల్గ,
నారోగ్య మగుఁజుండి! యవనియందు;

గీ. విద్య, యందంబు, బిడ్డలు, నెలఁత యున్న,
ధనము, ధాన్యంబుఁ, బశువులు, సౌధంబు లున్న,
సలియ కాపురము, నారోగ్యసంపదకును;
ఎన్ని యున్నను, వ్యర్థంబు లన్ని యగును.

గీ. బాలికలు, బాలు "ఆరోగ్యవారి" యనుచు,
వారి యొకటియు "యారోగ్యవారి" యనుచుఁ,
బొంగి, ముదమును, మదియందుఁ, బొంద జనదు;
భాగ్య మారోగ్యమును, సదా, వలయుఁ జూడ.

సీ. శేషున కైనను, జెప్పఁ దరమె కాని
బాధల నెన్నియో! పడఁగఁ జేసి,
యంటురోగంబుల కాధార మగుచుండు
నీఁగల, దోమల, నెలుకగముల,

నోర్పు నెంతయుఁ గల్గి, నేర్పునఁ గొట్టుచుఁ,
బరమున సుఖియింపఁ బంపవలయు;
సాలెగూళ్లను, బూఁజు, జాగు సేయక యుండి,
శుభ్రంబుగఁ, దుడువఁ, బూడవలయు;

గీ. గాలి వచ్చెడుమార్గముల్, గాంచునట్టు
లెత్తుగా నిండ్లు గట్టంగ నెంచవలయు;
వెల్ల నిండ్లకుఁ దఱచుగా వేయవలయు;
నిదియ యారోగ్యలక్షణ మెంచఁ జనుడు.

గీ. మదికి, నొడలికి, బలమును గుదురఁజేయు
నదియు, జీవులకు, ధర నాహార మగుట
విలుకోలఁదని, నెమ్మది, వేళ కెపుడు,
మంచియాహారముఁ దిన, సమంజసంబు.

గీ. బలముఁ గలిగించి, రక్తంబుఁ బ్రబలఁ జేసి,
యాయు వెంతయు నభివృద్ధిఁ జేయఁగలుగు
పప్పువస్తువుల్, భక్ష్యముల్, పాలు మున్న,
బుద్ధి వికసించు; సుఖమగుఁ; బొడము శాంతి.

గీ. బలముఁ గలిగించుగుణములు గలవి, గాన,
మితముగను గూరగాయలు, మేలు సేయు
పాలు, వెన్నయు, ఘృతమును, విలుకోలఁది,
హాముగొను చున్న, నారోగ్యఫలము గలుగు.

గీ. శక్తి, జ్ఞానంబుఁ, గలిగించుశక్తి గలుగు
రక్త మభివృద్ధి గావించుశక్తి గలుగు

చెట్టు లుండెడు తోఁటలఁ జెలఁగు మదులఁ
దిరుగు చుండంగ వలయును, దినదినంబు.

గీ. కోకిలంబులుఁ, జిలుకలుఁ, గూయు చుండి
మదులు చెలఁగంగ, నెంతయు, ముదము నిడెడు
తరువు లుండెడు స్థలములఁ దిరుగు చున్నఁ
గలుగు, నారోగ్య మయ్యదె, కలిమి, సుఖము.

గీ. మిగుల స్వేచ్ఛగ నడయాడు ఖగము లెన్నొ!
సంచరించుచు, సుఖముగ, సంతసిలెడు
నదులనదములను, జాలఁ, బ్రమదము నిడెడు
పులినములయందుఁ దిరుగంగ వలయుఁజుండి!

గీ. కష్టసుఖములు, మెండుగాఁ, గనఁగ జేయుఁ
గలుగుదేశాటనం బెంతో! సలుపు చున్న,
జ్ఞాన మెంతయు, మనుజుండు, గాంచుఁజుండి!
చెందు నారోగ్యభాగ్యంబుఁ, జెందు సుఖము.

గీ. పశువులకు, శిశువులకు, సర్పంబులకు ను,
గాన మెదఁ బ్రమదంబును గలుగఁ జేయుఁ;
బ్రమద మారోగ్యమున కెంతో! వలయుఁ; గాన,
సరససంగీత మెడ నెడఁ జనుడు వినఁగ.

గీ. జ్ఞాన మిడు చుండి, సుఖమునుఁ గలుగఁ జేయుఁ
గష్టపడు చుండి, యింపుగఁ, గవితఁ జెప్ప

కవులు రచియించుమంచి వాగ్గ్రంథములను,
జదువు చుండంగవలయును సంతసముగ.

గీ. పాటుపడు చుండి, సుఖమును, బడయు చున్న,
సుఖమె, యయ్యది; మఱియొండు సుఖమె కాదు;
క్షుత్తు బాధింప; భుజియింప; సుఖమె యగును?
క్షుత్తు లేకుండ; భుజియింప, సుఖమె యగునె?

గీ. కష్టములు, భువి, నరులకుఁ, గలుగు నెపుడొ!
కష్టకాలంబులందుఁ గలిగి తెలివి,
ధైర్యమును బోలునది, యేది, దలఁప వేమి,
విడువఁ జన దెపుడు, ధైర్యంబుఁ; బుడమి నరుఁడు.

గీ. కష్టములభాతి, మేఘముల్, గ్రీష్మ, నొప్ప
శీతభానుండు, మఱుఁగుచు, జెందుచుండి,
పవనమిత్రుండు, జలదముల్, పాఱదోలి
నట్టె వెలుఁగడె, జగతికి, హాయి నిడఁడె?

గీ. శాంతిసుఖములు గలిగించి, జనుల కెపుడు,
గౌరవంబును, నిండుగఁ, గలుగఁజేసి,
ధరణి, నారోగ్యమునకు, నాధార మగుచుఁ,
బరగు చుండును, నిజముగాఁ, బరిణయంబు.

గీ. తెలివి, బలమును, సుఖమును, దొలఁగఁ జేసి,
బహువిఘ్నంబుల, బాధలఁ, బడఁగఁ జేసి,
బాల్యమందున, ముదిమినిఁ, బడయఁ జేయు
నట్టి బాల్య వివాహంబులాపఁ జనును.

గీ. చిన్నతనమందుఁ బెండ్లిండ్లు సేయుచున్న,
నైకమత్యంబు రూపఱు నఖిల గతులు;
బలము లేకుండుబిడ్డలు గలుగుచుండు
రెన్నొ కష్టంబు లుపయించు; నెన్నఁ దరమె?

గీ. కష్టమును, నష్టమును, జాలఁ, గలుగఁ జేసి,
మనసు బాధించు చుండఁగ; మతమునందుఁ;
గలుగు నాచారముల నెల్లఁ, గాంచి, తెలివి,
మూలముట్టుగఁ దొలగింప, మేలె యగును.

గీ. దేహతత్వంబు, మనసును, దెలిసికొనుచు,
నన్నపానాదులందున, నఖిలమందు,
జాగరూకతఁ గాంచుచు, బాగుపడఁగ,
మసలుకొను చుండవలయును, మనుజుఁ డెపుడు.

గీ. వసుధ జీవితజాలములు దైవంబువలనఁ,
బరమకరుణను గలిగింపఁబడిన వగుట,
సాధ్య మగునంతవఱకును, సంతతంబుఁ,
జేయ కుండంగవలయును, జీవహింస.

---



# జ్ఞానభాస్కరము.

రెండవపరిచ్ఛేదము.

---

త్రిశ్వాసుఁ:—మిత్రమా! నీవు చెప్పిన వన్నియు, జ్ఞానగీతావాక్యములే యగును. ఎన్ని చెప్పిన నేమి? అర్చుకొని పోయిన నేమి? పీల్చుకొని పోయిన నేమి? బక్కగా నున్న నేమి? గిక్కగా నున్న నేమి? నా పేరు సార్థకమే. నా కున్న యారోగ్య మెవ్వరి కున్నదిరా?

ఈమధ్య, పాఠములు చదువకపోయినప్పుడు, మామాస్టరుగారు, మంచిపొడుగైన పేంబెత్తము చేతఁ బుచ్చుకొని, భయము గలుగునట్లుగా, నిటునటు, ఆడించుకొనుచు, కొట్టుటకు, నాదగ్గరగా వచ్చి, నా జేబులోఁ జేయి పెట్టి, బీడీలు, సిగరెట్లు, చుట్టలు, ఈమూడురకముల యారోగ్యవస్తువులును, దీసి చూచి, కొంచెముసేపు, నా శరీరముమీదఁ, జినుకులవంటిదెబ్బలవానకురిపించి, నవ్వినవ్వి, యప్పటినుండియు, నా పేరు, „త్రిశ్వా" మని పిలుచు చున్నారు.

సిగరెట్:—ఓరీ! రూలు వినలేదురా? అది మనకుఁ జాలమంచిరూలురా! వెరి బెస్టు రూలురా! మాస్టర్లు, బెత్తము పయోగింపనే కూడదట! పిల్లలను గొట్టనే కూడదట! ఆహా! కాల మెంత చక్కఁగా, సుఖకరముగా, మాఱిపోవు చున్నదిరా!

తిరిత్వము:—ఓరీ! మూర్ఖుఁడా! పాఠములు దిన్నగాఁ జదువకపోయిన యెడలను, బడికి సరిగ రాకపోయిన యెడలను, ముద్దుపెట్టుకొనెదరురా? దానిభావమును, నీవు, తిన్నగా, గ్రహింపలేకున్నావు. కొండఅుకొండఱు తొందరమూస్టర్లు, మంచియుద్దేశముతోనే; నొసటలు పగిలిపోవునట్లును, రక్తము కారునట్లును, గన్నులు బొక్కిపడునట్లును, ఒడలు తెలియకుండఁ, గొట్టెదరని, యట్టియాజ్ఞ చేయఁబడినదే కాని, మఱియొకటి కాదురా! ‚‚దండందశగుణంభవేత్” అనునీతివాక్యము, నెఱుఁగవు కాబోలు!

పూర్వకాలములలోఁ, బంతులుగారు గనఁబడినయెడలఁ, బిక్కసంచులలోఁ బడి, వంగివంగి, పిల్లలు పారిపోయి, ప్రాణములు దక్కించుకొనెడువారట! రక్తము గారునట్లుగాఁ, జింతబరికెలతోను, ఈతబ్బెలతోను, జెక్కపేళ్లతోను, బలకలతోను, దాటెడుమాపులపుస్తకములకట్టతోను, పదికెడఁబడిన దానితోనే, కొట్టెడువారట! కన్ను బొక్కిపడిపోవు నేమో యనునాలోచనయే లేక పన్లు పటపట కొఱుకుచుఁ, బంతులుగారు, వారియము చువారి ముచుడు గంటము గిరగిర తిప్పి, గిరాటువేయువారట! వెనుక, ముందు, చూడకుండ, నగారామీఁద వాయించునట్లు, బాగా బజాయించువారట!

గుంజిళ్లు, కోదండములు, గోడకుర్చీలు, తొడపాశములు, చెవులనులుపులు, బుగ్గనులుపులు, జుట్టుగింజుటలు, మొట్టికాయలు, లెంపకాయలు, తన్నులు, పిడిగుద్దులు, చేతులు త్రిప్పించి వేళ్లమీఁద రూళ్లకఱ్ఱతోను, గంటముతోను, కొట్టుట

యు. ఇవి యన్నియు. బళ్లలోఁ, బ్రతిదినమును, దీర్ఘములలాగు బాగుగా సాగుచు నుండెడినట! ఉపనయనకాలమందుఁ బంచశిఖ లుంపుట తరువాతఁ, బంతుళ్లుసుప్రాణకే యని నా కిప్పుడు తోఁచుచున్నది సుమా!

బోర్డులు, మ్యాపులు, ఈకాలములోఁ, గ్లాసులలో నుండునట్లుగా నాకాలములో, బాగుగా నెండతగిలెడు చోట, బళ్లలోఁ, బదియిరువదిబట్టలమొత్తని తెల్లనియిసుక పోసి, యుంచెడువారట! ,,వాగీశాద్యా" ,,దీపంజ్యోతీ" మొదలగు శ్లోకములు, బాగుగాఁ గంఠస్థముగా నుండునట్లు చదువనిపిల్లలను, ఎండలో బాగుగాఁ గాలి, వేడిగా నుండునాయిసుకలోఁ గోతిగంతులువేయునట్లు, నిలువఁబెట్టెడువారట!

ఆకారణముచేతనే, పూర్వకాలపుఁబిల్లలు, చాల తెలివిగలిగి, మిగులభయభక్తులుగలిగి, యెంతయు శ్రద్ధగాఁ, జదువుకొని, యీకాలములో, గొప్పగొప్పయుద్యోగములఁ జేయుచుఁ, బ్రఖ్యాతపురుషులగుచు సకలసుఖములననుభవించుచున్నారు.

పూర్వకాలములలో, సాధారణముగాఁ, బాలకులయందుఁ, గుంటిపంతుళ్లు, గుడ్డిపంతుళ్లు, గూనిపంతుళ్లు, సత్తిపంతుళ్లు, మూగపంతుళ్లు, చెవిటిపంతుళ్లు, తొఱ్ఱిపంతుళ్లు, ఉండెడువారట! ఎవరికైన నేయవయవమునందయినను, లోపమున్నయెడల, వారుమిక్కిలి తెలివిగలవారుగ నుందురుసుమా! ఇది యొకప్రకృతిరహస్యాంశము. అట్టివారియొద్దఁ జిన్నప్పుడు చదువుకొను పిల్లవాండ్రు కూడ, వారివారిమనస్సుప్రకృతినిబట్టి,

తులు, గొట్టుకొనిపోవుచున్నను, బరబర యీడ్చుకొనిపోయి, బడిలోఁ బంతులుగారియెదుటఁ బారవేసెడువారట!

తరువాత, గొంతసేపు, పంతులుగారును, ఆపిల్లవాఁడును, నెత్తురయ్యును పట్టిట్లుగాఁ, బంతులుగారు గొట్టుచును, బిల్లవాఁడు దప్పించుకొనుచును, బంతులుగారు పిల్లవాని జుట్టుపట్టుకొని గింజుచును, బిల్లవాఁడు పంతులుగారికాళ్లు పట్టుకొని, నులుముచును, వెనుకకును లాగుచును, బడియందంతటను గిరగిర గంతులువేయుచుఁ దిరుగుచుండెడువారట! అది యంతయు, మిగిలినపిల్లకాండ్రు గడగడ లాడించుచుండెడివట!

ఓరీ! అదియే ఆకాలములోఁ, బంతుళ్లకును, బిల్లలకును, డిగ్రీలు. జన్మాష్టిక్కు సుమా! ఈకాలములోఁ బిల్లవాండ్రు రాకపోయినయెడల, ఆబ్సెంట్ మార్కువేసి, యూరకొందురు. ఒకప్పుడు జుల్మానా వేసెదరు. అందులో నేమున్నది? పారవేసెదరు. ఒకప్పుడు మోకాటిపీఁటగా సంపుగా లక్ష్యమే లేని దండుగవంటి చిన్నదెబ్బలసంగతి చేయుచుందురు.

ఓహో! అటులోయినా! మనపుస్తకాలకట్టగాఁడును, తార్కికరాం టోపీవాడుగాఁడును, ఏదేమో మాటలాడుకొనుచు వచ్చుచున్నారు. మనవాండ్రిలో నెంతమాత్రమును, బంస్ఛ్య యూనిటీ యనునదియే లేదు. అందువలననే, సారె, వెలిసారి, మనమనకొకంటిరి. ఏమీ కాదే. అట్లుగ్, పాపర్టీలో, డీప్గా, డౌన్నై పోవుచున్నదిరా! బిడిల్ నెప్పు. డిసేసింగు, ఎంప్టీ మ్యాడ్లాంపు, ఏనిమిషమున కానిమిషము, ఆసేతుహిమాచల

పర్యంతము,ఎక్కువయి పోవుచున్నవి! దేశము, ఫ్యూర్లీ కినాట్ హోల్ప్ స్టేట్‌లో నున్నదనెదవా లేదా? చెప్పరా!

ఓరీపుస్తకాలకట్టగా! ఇన్నాళ్లు నెక్కడ నున్నావురా? నెలదినములు చూచిచూచి. నిన్ననే నీపేరు కొట్టివేసినారురా! పుస్తకము లన్నియు నెప్పుడును జెడికపోయిన, నెప్పుడును జదువకపోయిన నతంత తుమ్ములాగున గుక్కనాలుకలలాగున నున్నవేమిరా? కొన్నిపుస్తకములలో, మొదటపేజీలు మధ్య పేజీలు, చివరపేజీలు, నుండనే యుండ వేమిరా? ఏమి చదివెదవురా? ఏలాగున బరీక్షలో ప్యాసయి యేమస్తావురా?

ఔనుగాని, ఫూలిష్ ఫెల్లో! ఏమిరా నీయున్నిపుస్తకముల మీదను, దోసరిగా, సడ్డముగాను, నిలువగాను, పసపుగీత లున్నవేమిరా? ఓహో! ఈమధ్య విఘ్నేశ్వరునిపూజ చేసినావుకాంబోలు! ఓరీ! నీవు బడికిం దిన్నగా రాక, పాఠములు చక్కంగాం జదువకపోయినయెడల, ,,నన్ను పూజచేసినవాండు; కన్నులు మూసికొని, తలపై కెత్తి నన్ను ప్రార్థించినాండు; నాకు కడుపు నిండ ఉండ్రాళ్లు పెట్టినాండు" అని దయగలిగి, జాలిపడి, ఆ విఘ్నేశ్వరుండు వచ్చి, అడ్డముగాం బడి, తొండముతో చేయి పట్టుకొని, మాస్టరుచేత, మార్కులు వేయించు ననుకొన్నావురా? ఏమిరా! అలాగున ఇగిలించు చున్నావు?

పుస్తకాల:—రేపువచ్చి, జీత మిచ్చి, మరల పేరు వేయించుకొంటానురా! ఐన నయినది. భయములేదు. ఫైన్ కూడా నిమ్మనిన నిచ్చివేసెదను. పేజీలు లేకపోయిన నేమి?

పుస్తకములు లేకపోయిన నేమి? నేను జదువకపోయిన నేమి? ప్యాసు కాకపోయిన నపుగరా! పరీక్షయేమగుబాగుననే, యీ యేమగూక, డంకామీాన దెబ్బగొట్టి, ప్యాసవుతానురా! చూచుము. ప్యాసులోనికిటుకుకుఇదిరా. తప్పక జయము పొందె దను. ఏమనుకొన్నావురా నాశక్తి?

ఓరీ! మరచిపోయినావురా? మొన్న మొన్ననేకదా! నీవు, తల్లిదండ్రులను, దుఃఖపెట్టఁగూడదని, పెద్దపెద్ద శ్రీరంగనీతు లతోఁ గొప్పయుపన్యాసము చేసినావు. మాఫాదర్, బజారు నుంచి, మట్టివిఘ్నేశ్వరుని, దేవుఁడని, కొనితెచ్చినాఁడురా! మామదర్, నాపెట్టెలోనిపుస్తకము లన్నియుఁ, బైకిఁ దీసి, యొకగిన్నెలోఁ జిక్కఁగాఁ బసుపు గలిపి, దిట్టముగాఁ బూసివేసె నదిరా! అది మీారు చూచినమొదల, నవ్వెదరని యన్నిపుస్తకములకుఁ బైన కవర్లు వేసినానురా! అక్కడక్కడ పేజీలు చింపివేసినానురా!

సిగరెట్:—ఔనురా! ప్రమోషన్ డేస్‌లో, కనేకకార్యణములచేత, నేడ్వఁగా నేడ్వఁగా, లాగులలోని తోట్టిపడవలలాగునఁ దోసివేయుదురురా! ఏలాగున ప్యాసగుదునో, ఆకిటుకు నాకును దెలియును. అదిచెప్పఁగూడదు. అందఱికిఁ, గోట్లకు మూడునాలుగుజేబు లుండును. నీకోట్లకు, ట్రౌజర్లకు, రహస్యముగా లోపలిలోపలిసంచులు, మఱినాలుగుండునురా! అదినాకు దెలియును. వాటిలోఁ బుస్తకములలోని పేజీలు చించి, దోపి, పరీక్షలోఁ దీసి, చూచి, వ్రాసివేయుదురా! కాని, బహుజా

గ్రితసుమా! ఈరోజులలో, మాస్టర్లుకూడ, బహుతెలివిమీఱి నారయినారురా!

పరీక్షలలోఁ ముంముగా, జేబులు, గీబులు, అట్టలు. పక్కజేబులు, టోపీలు, క్రాపింగులు,బూట్సు, అన్నియు బా గుగాఁ జూచి, మఱియు వ్రాయమను చున్నారు. ఎందుకు చేతనురా! కడచినసంవత్సరము, మనహరిరావు క్రాపింగులో వ్రేళ్లు దోఁపిదోఁపి, బాగుగాఁ బరీక్షచేసి చూచినారు.

పుస్తకాల:—ఎందుకా? రెండేండ్లక్రిందట, వాఁడు, డొంకవంటి తనక్రాపింగులోఁ, గొన్ని కాగితములు దోపుకొని పైన టోపపెట్టుకున్నాఁడట! మాస్టర్లు, మనకంటెఁ దెలివిఁగల వాండ్రు, కాఁబట్టి! టోపి తీసి, తలమీఁద, దబడదిబడ వాయిం చి చూడఁగాఁ, గుండేళ్లవలెఁ, గొన్ని యచ్చుకాగితములు బయటికి దుమికి. పడినవట!

సిగరెట్—వండ్రడఫుల్! మనస్టూడెంట్సులో, నెంతెంత వార లయిన నున్నారుసుమా! ఇప్పుడే కాదు. పూర్వకాల ములోఁగూడ, నొక పరీక్షలో, నొకమహాబుద్ధిమంతుఁడు దన పేపరు వ్రాసియియ్యడము మాత్రమేకాక, మఱియొక స్టూడెంటు పేపరుగూడ, వ్రాసి యిచ్చినాఁడట! ఆహా! ఎంతధైర్యముగల గుండెకాయరావాడిది! వాని దెంత తెలివిరా? ఎంతచుఱుకురా! ఒకన్నుఁడు వ్రాయవలసిన కాలములోనే, యిద్దఱిపేర్లు వ్రాసి నాఁడట! వానితెలిగలమోసమున కెంతయునను సంతోషింపవల సినదే. పాపము దాగుతుందిరా! పట్టుకొన్నారు. ఏలాగునఁబట్టు

కొన్నారో? పట్టుకొనినవాఁ డెంత తెలివిగలవాఁడో, యాలోచింపుము. తరువాత నేమేమో చేసినారట! అది స్టూడెంటుసావృత్తిశేషమున కెంత డిజానరురా!

ఏమిరా! తారకరామ్! ఈమధ్య చాలరోజులనుంచి, కనఁబడడమే మానివేసినావు. కారణము దెలియక, కొట్టుకొనుచున్నాను. తెల్లవారుజాముననే కాఫీహోటల్స్, అలవాటు చేసినావు. కాఫీ, కారపుపూస, ఆవెన్నలాగు కరకరలాడి కరగిపోయే పకోడీలు, సేమియు, మీగడపాలు, ఏమియులేకపోవుట చేత, నానాలుక, గులగుల లాడుచున్నది. నల్లమందు లేని వానికివలె, నాకాళ్ళు పీకుకొనిపోవుచుండును. నాయదృష్టము చేత, మరలఁ గల్గబడినావు. ఇంక ఫర్వాలేదురా!

తారక——ఎఱుఁగవురా? ఈమధ్య మనతనూపాపట్టణములో, బెద్దకోమటి, ధనాల ధర్మాలసెట్టిగారు, ఎనిమిదిమాసములకిందట, స్వర్గస్థు లయినారు. ఆయన యెన్ని దేవాలయములు కట్టించినారురా! ఎన్ని సత్రములు పెట్టించినారురా! ఎన్ని వేదపాఠశాలలు పెట్టించినారురా! బాటసారులసౌఖ్యముకొఱకుఁ, బట్టణములో నన్నివైపులను, ఉప్పుకారములతో,ఊరవేసినయుసిరికకాయలతో నెన్నిచలివేంద్రిలు పెట్టించినారురా! ధర్మాలసెట్టిగారు, అందఱుకోమట్లవంటివాఁడు కాఁడురా! దయగలమనస్సుగలవాఁడు. మోసములేనివాఁడు. భాషాభిమానము గలవాఁడుసుమా! కవీశ్వరులనినఁ, జాల ప్రోత్సాహము చేయుస్వభావము గలవాఁడు. అప్పుడప్పుడు దానుగూడఁ జిన్నచిన్నపద్యములువ్రాయు చుండెడువాఁడు. అవి చదువుకొనుచు, సుఖించుచుండెడువాఁడు.

# జ్ఞానభాస్కరము.

## మూఁడవప్రకరణము.

---

ఆమధ్య, ,,ఆనందకవి" యని బిరుదుపేరుపెట్టుకొని, దేశసంచారము చేయుచున్న మంగళగిరి శ్రీరంగకవి యనునాయన వచ్చి, తాను, భారతభాగవతరామాయణములు మహాధాటిగాఁ బురాణము చెప్పుటయందు, మన తెనుఁగుదేశములో నెల్ల మహాప్రసిద్ధి పొందిన ఉళ్లక్కిశాస్త్రులువారి జ్యేష్ఠకుమారుఁడ ననియును, గీర్వాణాంధ్రంబులయందుఁ, దన కపారమయినపాండిత్యము గలదనియుఁ, దాను గూడఁ బురాణము చెప్పఁగల ననియుఁ, దాను జెప్పుపురాణము నెంతశ్రద్ధగా వినిన సంతసునాయాసముగాఁ వినువారు మోక్షపదవిఁ బొందఁగల రనియును జెప్పి, కృతినందుట, సప్తసంతానములలో నొకటి యనియుఁ, గృతి నందినయెడలఁ బితృదేవతలు సంతసించెదరనియుఁ, జాలమట్టుకుఁ జెప్పి, ఋషిప్రోక్తములయినట్టియు, మనహిందువులలో ననేకులచే, నీశ్వరదత్తగ్రంథములని విశ్వసింపఁబడు చున్నట్టియు నాలుగువేదములను, పద్యకావ్యములుగా, నాలుగుసంపుటములుగా వ్రాసి, కృతి యిచ్చెద ననియుఁ, దాను వ్యాసకాళిదాసులయొక్కయుఁ, గవిత్రయమునారెంటియొక్కయు, నష్టదిగ్గజములయొక్కయు, నవతార మనియుఁ, బూర్వకవులు దెనిఁగించిన

పురాణములు, సంస్కృతమునకు సరిగ లేకపోవుటచేత, దోమకా లాంతయయినను భేదము లేకుండఁ, బదునెనిమిది పురాణము లను, దాను, మరలఁ, దెనిఁగించెద ననియు, నీవాంధ్రభోజుఁడ వనియు, నపరకృష్ణదేవరాల ననియు, గంభీరముగాఁ జెప్పుచు,

సీ. సార్థకనామంబు, సంతసంబుగ జనుల్
పేరిమ మీఱంగను, బేర్కొనంగ,
వైశ్యవంశంబున, వరగుణంబులతోడఁ,
బ్రభవించియుంటివి వాసిఁ గాంచ;
సిరిసంపదలతోడ, సేమంబుఁ గను చుండి,
పరుల రక్షింతువు, కరుణ మెఱయ;
సత్రంబు లెన్నియో! చావళ్ళెన్నియో!
కట్టించియుంటివి ఘనత మీఱ;
వ్యాపారములయందుఁ, బాప మింతయు లేక,
మనుచు నుండెడునట్టి మాన్యగుణుఁడ!
గీ. కవికులంబులపాలిటి కల్పతరువ!
వంశ మభివృద్ధి, సతతంబుఁ, బడయు చుండ,
ఘనత మీఱంగఁ బుడమి, దీర్ఘాయువగుచుఁ,
జెలఁగు చుండుము, ధర్మాలసెట్టిఘనుఁడ!
సీ. ఆర్యులౌపూర్వుల యాచారముల నెల్ల
మన్నింప, ముద మందుమనసు గలిగి
మొక్కుల నన్నిన, మొక్కియున్నను, నీవు,
జీవహింసన యొకింత చేయ కుండి,

గ్రామదైవములకు, గ్రామదేవతలకుఁ,
బానకంబును, బండ్లు, పంపినావు;
గుడ్డివారలకును, గుంటివారలకును,
బట్టలు, నన్నంబుఁ, బెట్టినావు;
గీ. వర్ధమానుచుఁ, గొందఱఁ, బంపుచుందు
వసలె మానుచుఁ, గొందఱఁ, బంపె దీవు;
చేయఁ గల్గెడుమేలునె, జేయు చుందు
వెట్టిగుణివయ్య! ధర్మాలసెట్టిఘనుఁడ!
సీ. చేతంబు లలరంగఁ, జేసితి కొమరుని
వైవాహికం బెంతొ వైభవముగ!
హరికథల్! చెప్పించి, హరిదాసులకు నెన్నొ!
వసతులు, ముదమంద, నొసఁగినావు;
భూదానము లవెన్నొ! గోదానము లవెన్నొ!
వాసిఁ గాంచంగను, జేసినావు;
కన్యాప్రదానముల్, గావించి, మితిలేని
పుణ్యంబు, నెంతయుఁ, బొందినావు;
కానుసంభావనల్ గావించి, పాటల
పెసఁగులాటలనుజూపించినావు;
సంతర్పణంబులు, సంతసంబుగఁ జేసి,
యాశీస్సులను బొంది, యలరినావు!
గీ. పండితుల కీవు నవరత్నకుండలములు,
మెచ్చి, యుత్సాహ మొనరింప, నిచ్చినావు;

సెట్టి వన, నీవ, ధర్మాల సెట్టిఘనుఁడ!
దానకర్ణుండ వీవయ్య! ధరణి నిపుడు.
గీ. ఘనతఁ గలిగింప, నీయందు; గలిగియుండు
దైవభక్తియు, వ్యాపారధైర్యగరిమ,
సరససంభాషణంబుల శాంతగతియు,
ధర్మగుణమందుఁ గలయట్టిత్వరితగతియు,
వర్ణనము సేయ, నా కింత, వశమె యగునె?

అని, యీపరికారముగాఁ, బొగడినఁ, బొగడినఁ బొంగుట, సాధారణముగా మనుష్యులస్వభావ మగుటచే, మిక్కిలి శ్రావ్యముగాఁ జదివినతోడనే, పాప మాదైవబ్రాహ్మణభక్తి విశ్వాసములుగల సెట్టిగారుబ్బిపోయి, యుబ్బిపోయిఁ వానికి వెయ్యిన్నూటపదహారురూపాయలు, గోత్రరూపాయలు, ధగ ధగ లాడెడునొక వెండిపళ్లెములోఁబోసి, బహుమానముగా నిచ్చి నమస్కరించుచు, నెదుట నిలిచియుండఁగా, నాశీర్వదించుచు, నాపళ్ళెముతోసహా, బాగుగా మూటఁగట్టుకొని, యాకవీశ్వరుఁడుగారు, దానుబయలుదేరిన సమయమునందు, మంచిదివ్యమయినశకున మయినదని,సంతోషించుచు,లోపలనుబ్బిపోవుచుఁ దానదివఱకు మొక్కుకొనిన పరికారముగా, శ్రీపానకాల నృసింహస్వామివారి సందర్శనము చేయుటకయి, శ్రీమంగగిరి యాత్రకు దయచేసినారు.

ఆహా! ఈలాగున, నాయనడబ్బునలన నెంద ఱెందఱెంతెంత సుఖముగా బ్రతుకు చున్నారురా! ఎందఱు పెండ్లిండ్లు

ఉపనయనములు చేసికొను చున్నారురా! ఎందఱు గృహములు గట్టించుకొన్నారురా! ఛీ! వెధవబ్రతుకు ఎందుకురా! బ్రతుకనిన నాలాగునసే, యుండవలయునుగదా!

ధర్మా సెట్టిగారెప్పుడును,

గీ. పాపచింతలు, మదినుండి, పాఱదోలి,
ధర్మచింతలె, పుణ్యంబెఁ దలఁచు చుండి,
మోసగుణమును, మదినుండి, త్రోసివేసి,
చెడ్డవస్తువు లేవియుఁ, జేర్ప కుండి,
మంచివస్తువు లన్నియు నుంచికొనుచు,
నసలు కస లంత లాభంబె, యాశపడక,
కొంచె మగు చుండులాభంబె, కోరు చుండి,
యమ్ముకొను చుందు నన్నియు నెమ్మదిగను.

అని, నీతినియమముచేసికొని, వ్యాపారము సాగించు కొనుచు, లక్షులుకొలఁది, ధనమును సంపాదించి, "పరోపకారార్థ మిదంశరీర" మని తలంచి, పుణ్యకార్యము లెన్నియో చేసి, లోకములోఁ, గీర్తికాయమును నిలుపుకొని యున్నారుసుమా!

ఆయన కొక్కఁడే ముద్దులకుమారుఁడు. వాఁడు నాకుఁ బ్రాణస్నేహితుఁడుసుమా! మనతోఁగూడఁ జదువుకొనుచుండు కనకారావును, మఱచిపోయినావురా? వానికి గానసభ లనిన మిగుల నిష్టము. వారియింట, రూపాయిలబస్తాలును, గాసుల బస్తాలును, ఏమూలచూచిన, నదియేపనిగ, మూలుగు చుండును వాఁడే నాకుఁ బ్రతిరోజున నొకరూపాయయో! యొకపిల్లకాసో!

యొక పెద్దకానో! తెచ్చి యిచ్చుచుండెడువాఁడు. అదిపెట్టినదే కదా! ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము, రాత్రి, కాఫి, ఉపమ, లడ్డూలు, సేమ్యా, మీఁగడపాలు, మొదలగునవి యన్నియు, మనము ఫుల్ బెల్లిగాఁ దిని, పైగ నాలుగుకిల్లీలు వేసి, మనయాట లాడు చుండెడువారము.

ఇప్పుడు, తండ్రి గాలముచేసినందునఁ, దాళములు వాని చేతిలోఁ, బడినవి. సర్వాధికారము వానిది. తల్లి యమాయకు రాలు. ఉన్నసొమ్మంతయుఁ, జల్లగా, నపహరించుటకు, మేన మామలు, అన్నదమ్ములు, పెత్తండ్రులు, పినతండ్రులు, ఏయితర దగ్గఱబంధువులు నెవరును, లేకపోవుటచేత, మనమే యిప్పుడు వానికి, ఫుల్ ఎడ్మినిస్ట్రేటర్ల మయినాము. మోటార్ కార్స్, సైకిల్స్, గ్రామోఫోన్లు, బిగ్ బిగ్ మిర్రర్స్, వాకింగ్ స్టిక్స్, టర్నింగ్ చేర్స్, ఈజీచేర్స్, బిగ్ ఆక్ మెరాన్, మొదలగున వన్నియు, రకరకములు ఫర్నిచర్, రమారమి యిరువదివేలరూపా యలదికొని, స్ప్రింగుగా ప్యాక్ చేయించి, నిన్నరాత్రి బొంబా యిమెయిలులో వచ్చినాను. దానివల్లనే యిప్పుడు నాకుఁ జాల లాభించుచున్నది.

ధర్మాలసెట్టిగారియాత్మకు, శాంతి గలుగవలె ననియు, నాయన తప్పక, స్వర్గములోకే వెళ్లవలసినమహాపుణ్యాత్ము డయినగొప్పదాత యనియుఁ, జెవి నిల్లు గట్టుకొని, చేయవలసిన పను లన్నియు బాగుగా నాఁటిపోసి, శవమును శ్మశానము నకుఁ దీసికొనిపోవునప్పుడు, పిల్లలకు మిఠాయిపొట్లములు, బస్తాల

కొలంది పెప్పరుమెంటు బిళ్లలును, నిమిషనిమిషమునకు నెగురవే యించినాను. రూపాయలు, కాసులు, దోవపొడుగున గుప్పిళ్ల కొలంది నెగురవేయించినాను. అలాగునఁ జేసినఁగాని, సెట్టిగారు స్వర్గములోకి, సులువుగా వెళ్లుటకు, సాధ్యముగాదనియు, సుఖపడ నేర రనియు, నమ్మినట్లుగా, బాగుగా వేదశాస్త్రములు, కర్మ కాండ చదువుకొనిన మహాగొప్పకుండములపండితునివలెఁ, గర్మ కాండఫలము యీనత్తు, చెప్పిచెప్పి, యన్నియుఁ జేయించితిని. ఆయన స్వర్గములో నింకను బెటర్ ప్లేస్‌లోకి, వెళ్లునట్లుగా, నెక్కువగా దశదానములు, షోడశమహాదానములు, బాగుగాఁ జేయింపవలెనని, నెక్కుడను లేనియాలోచనలు చేయుచున్నా ను. ఈవిషయములో, బాగుగా నాలోచనలు చెప్పుటకు, ఈ పట్టణములో నున్నసుప్రసిద్ధకర్మకాండ సోమయాజులుగారితో, కాన్ఫిడెన్షల్‌గాఁ, గొంత మాటాడవలసి యున్నది.

తిరిత్వము:—అల్లో! నీ వెంత డిసీట్‌ఫుల్ ఫెల్లోవురా! ఐతే, యేమయినను ధర్మాల సెట్టిగారి యాత్మకు శాంతి గలిగినదిరా?

తారక:— సెన్స్‌లెస్. ధర్మాల సెట్టిగారియాత్మకు శాంతి గలిగినదో! లేదో! నాకుఁ దెలియదు. నేను చెప్పలేను. చచ్చినతరువాత సంగతులు నెవఁడు చెప్పఁగలఁడురా? మట్టి, బూడిదె కాదురా? ఖనన దహనములే కదా! ఆత్మ, గీత్మ, నాన్‌సెన్స్ గాని, యీయాత్మవ్యవహారములో, రెండువేల రూపాయలు, రహస్యముగాను, బహిరంగముగాను, మిగుల్చు



**THARAKA RAM - "PRINCE OF THIEVES."**

తారకరామ్-టోపీదాస్.

కొనుటచేత, నాయుత్కృష్టమాత్రము, బాగుగా కాంతి గలిగి నది. అది పెట్టియున్న పెట్టెలోనే, విశాలమయినస్థలముగల యొకమంచిమేజా కొంపలము నని, యనుకొను చున్నాను. ఏదైనను, నీ పైటాలో నున్నయెడల జూడరా!

సిగరెట్:—ఓరీ! తారకరామా! నిన్ను జాలకాలము నుంచి, యొకసంగతి యడుగవలె నని యనుకొను చున్నాను. నీపేరు, తారకరాము, ఆ ఫెబాన్, అని మీతల్లిదండ్రులే పెట్టినారా? లేక, యెవ రయినను పెట్టిరా? లేక, నీవే పెట్టుకొన్నావా? నీపేరు వినిన, నాకు, జాల చిత్రముగా నున్నదిరా! చెప్పుము. యిప్పుడుగా వినెదను.

తారక:—ఏమురా! అలాగున నడుగుచున్నావు! నేనేమి "ప్రిన్సు ఆఫ్ వేల్సు" నను యనుకొను చున్నావా యేమి? "తారకరాము" అనునది, మాతల్లిదండ్రులు నాకు, చిన్నప్పుడు పెట్టినయుత్తమపేరురా! పెండ్లి యయినయిరువదిసంవత్సరములవఱకును, బిడ్డలు లేకపోవుటచేత, మాతల్లిదండ్రులు, పాతదేవుళ్లకును, గ్రొత్తదేవుళ్లకును, శాంతదేవతలకును, క్రొత్త దేవతలకును, లెక్కలేనన్ని మొక్కులు మొక్కి, చివరకు, మాతండ్రిగారు, విరక్తిచేత, యిల్లువిడిచిపెట్టి, యెన్నియో! తీర్థయాత్రలు సేవించి, సేవించి విసిగిపోయి, చివరకు, హిమాలయపర్వతములకు సమీపముగా నున్నతారకరామాశ్రమమున దపస్సుచేసికొనుచున్న నైమిసనందల సంవత్సరములవయస్సుగల

యొకమహాత్ముని సేవించి, యాయనయనుగ్రహమును బడసి, తారకరామనామమంత్రము నుపదేశమునుబొంది, యింటికి వచ్చి, మిక్కిలి నిష్ఠతో, నొకసంవత్సర మామంత్రమును జపించి, బ్రాహ్మణసంతర్పణలు, మొదలగుపుణ్యకార్యము లనేకములు చేయుచుండగా నేను జన్మించితిని. ఆకారణముచేతనే, నాకుఁ, దారకరామ్, అని పేరు పెట్టినారు.

„టీ "పేదాస" సరే; ఇది మనస్నేహితులందఱును, నా తెలివికిని, నా యభ్యాసమునకును, జాల సంతోషించి, యొకనాఁడు హోటలుస్పార్ భోజనపు యాసభలోఁ, బద్యములతోను, గీర్తనలతోను, సుస్వరశ్లోకములతోను, ఆటలతోను, ఆకాశమువఱకు, గొప్ప బలవంతముగా, లాక్కొనిపోయి, లెక్చెర్ల మీఁద లెక్చెర్లిచ్చి, బంగారుమీఁద నప్పట్లు గొట్టి, మెడల్స్ తగిలించి, యిచ్చిపైటెలుండు!

ఆనాఁటిలలో, మోటుదుకాణపు, గ్యాస్‌లైట్లు లేవురా! ఆరోజు సింహపద్మము. బహుళ్ళు మేఘ మయినను, ఆకాశమున లేనేలేదు. పుష్పపుష్పిలలాగు, వెన్నెల సంతోషకరముగాఁ, బ్రకాశించుచున్నది. మనోహర మయిననీలాకాశమున, మిణుకుమిణుకుమను నక్షత్రములును, సంపూర్ణ శాంతిని బోధించుచుఁ బూర్ణచంద్రబింబమును, బ్రకాశించుచుఁ బరమకరుణాళు వయిన యాదేవునిమహిమను, గోటినోళ్ళతో, వెళ్లడించుచున్నవి.

తల్లిదండ్రుల కెంతయో బాధపడుచుండగను, ఊరేగించి, చివరకు నన్ను మాయింటియొద్ద విడిచిపెట్టినారు.

అప్పటికి బల్లు తెల్లవారిపోయినదిరా! ఆరాత్రి నీ వుండి చూడవలసినదిరా! నీవెంతయో ముచ్చటపడి, యడిగినావు గనుక, అది యంతయు విస్తరముగా, సూక్ష్మముగాఁ జెప్పినాను. నావిచిత్రచరిత్ర నీ కేమి తెలియునురా! వ్రాసిన యెడల రెండుమూడు సంపుటముల చిత్రవిచిత్రగ్రంథము తప్పక యగును. ఎప్పుడో తీఱుబడియున్నప్పు డాస్వీయచరిత్రమును వ్రాసివేసెదనురా.

ఆరోగ్య:—స్నేహితులారా! ఇంక మీఘన్ని వర్ల్డ్లీ వైజ్ టాక్ కట్టిపెట్టవలయు నని నాకోరిక. అసలువిషయము నారోగ్యమును దాటించివేయుచున్నారు. ఎన్ని చెప్పిన నేమిప్రయోజనము! ఈమధ్య ననేకపండితులుండి, చాలలోకానుభవములుగల గొప్పగొప్పడాక్టర్లు, ఒకమహాసభచేసి, అందులో, బీడీలు, సిగరెట్లు, చుట్టలు, నల్లమందు, కల్లు, బ్రాంది, మత్తుద్రవ్యములు, ఆరోగ్యమునకుఁ జాల భంగకరము లని, చెప్పిచెప్పి, యవి గలిగించు ననేకరోగములు, లోకోపకారార్థముగా వెల్లడించి, యవి మానివేయుట, చాలమంచి దని, హితోపదేశము చేసియున్నారు.

అది మంత్లీపేపర్లలోను. ఫార్టినైట్లి పేపర్లలోను, వీక్లీపేపర్లలోను, డేలీపేపర్లలోను, గ్రాఫిక్కులలోనుగూడఁ, బబ్లిష్ చేసి యున్నారు. విన్నారా? మనము వారందఱికంటెను, మహా

జ్ఞానులమురా? అందుచేతనే, మనగవర్నమెంటువారు, డాక్టర్లచేతఁ బిల్లలను బరీక్షచేయించుచున్నారు.

త్రివిక్రమము:—అవునురా! పరీక్షచేయుచున్నారు. ఫీజు పుచ్చుకొనుచున్నారు. కాని రోగముపేరేదియో పెట్టి, వ్రాసి యిచ్చి, మందుపుచ్చుకో, అని, చెప్పి, వెళ్లిపోవుచున్నారు. కాని, దానికి మందేవరయు నిచ్చుటలేదుగదా! మనమో, యేమందును బుచ్చుకొనకుండ, నేరోగములేకుండఁ, జావకుండ, నాలాగునే చదువుకొనుచున్నాము. చెప్పు దీనికి జవాబు. నే నన్నియు మానివేసెదనురా! కాని, వ్యాపారభంగము చేయు వాఁడను గానా?

విను అన్నియు బాగుగనేయున్నవి; కాని, అలాగునఁ బరీక్షచేయుచున్నందులకు, స్థితిగతులనుబట్టి, యూరకయో, లేక, కొంచెము డబ్బుపుచ్చుకొనియో, మందు లిచ్చి, రోగములు కుదుర్చుచున్నయెడలఁ, జాల మేలు గలుగు నని నా యభిప్రాయము. ఇదియే నేను జెప్పవలసినది.

ఆరోగ్య:—ఓరీ! చీకటిపడుచున్నది. ఇంకను గొన్ని ముఖ్యాంశములు శీఘ్రముగాఁ జెప్పి, సభ చాలింపవలసి యున్నది.

త్రివిక్రము:—దయచేసి, త్వరగాఁ గానియ్యండి. బయ సో...పునే సగుచున్నది. కాఫీదుకాణములు, బీడీదుకాణములు, గట్టివేసెదరు. తరువాత నాకుఁ జాలఁ జిక్కు వచ్చును. ఫోజ

నము లేకపోయిన, నెన్నిరోజులయిన నుండఁగలను గాని, యవి రెండును లేకపోయినయెడల నొక్కనిమిషమయిన నుండలేను.

పాపము! వేళ్లు కొట్టివేసినారు. ఇరువదిదినములనుంచి, అయోమయంగారును, అమృతయ్యలింగముగారును, పరంజ్యోతిరావును, అసలే కనఁబడుట లేదు. ఓహోహో! అదిగో! వారు కూడ వచ్చుచున్నారు. జరుగుఁబాటులేక, చదువు మానివేసి, స్వతంత్రముగా జీవించుచ క్లోనో పన్నాగము పన్ను చున్నారట! రానియ్యండి. సంగతులు దెలిసికొందము. అందులో నయోమయముగారు డేలిమేలేకదా! రెండవవారు అర్తిడాక్సు ఫూలిష్ఫెల్లో మూడవవారు ఛగోరెస్వామ్యరె. వీరిముగ్గురును, జేరినయెడల, నిప్పు లేకుండ, మూడులోకములను దగులబెట్టఁగలరు. అమ్ముగ్గురును, నిశ్చయముగా, బహుబ్రెయిమెండస్ ఫెల్లోస్.

ఆరోగ్య:—సైలెన్స్. అదిగో! నీపాడుబుద్ధి పోనిచ్చుకొనినావుకావు. ఆముగ్గురిస్నేహము పట్టవద్దని, నే నెన్నిసార్లు నీకుఁ జెప్పియున్నాను. నీవు వింటావురా? పరంజ్యోతిరావు స్నేహము పట్టినప్పటినుంచియు, నీవు మఱియుఁ జెడిపోవుచున్నావట! ఏదియోయొకవిధముగాఁ బొట్టలుపోసికొనుచుఁ, గాలక్షేపము చేయుచుండుబావాజీల కేమియో! పారమార్థిక విషయములు చాల బాగుగాఁ దెలియు నని, భ్రమించి, భంగుదాసుబావాజీగారిమఠమున కరుగుచు, గంజాయిదమ్ముకొట్టుట కూడ నలవాటుచేసికొను చున్నావట! అదంతయు, నాకుఁ

గ్ణాకర్ణిగ, నిన్ననే తెలిసినదిలె. ,,పుట్టినబుద్ధి పుడకలతోఁ గాని పో" దనుసామెత, యూరక పోవునా? మనకు విస్తారము కాలము లేదు. ,,అధికస్యఅధికంఫలమ్" అన్న శ్లోకపు ముక్క మరలఁజెప్పెదను. వినండి. మీ రాలాగునఁ జేసిన బాగుపడె దరు. లేదా, మీకర్మమున కెవరుకర్తలు.

మన మందఱమును, ముఖ్యముగా, విద్యార్థుల మయిన మనము, చుట్లు, బీడీలు, సిగరెట్లు, కాఫీదుకాణములుఁ పూర్తిగా మానివేయవలెను. సాధ్య మగునంతవఱకు, శుభ్ర మయినమంచిబట్టలు వేసికొను చుండవలయును. మంచిగాలి మంచినీళ్లు, మంచియాహారము, నుపయోగించుకొను చుండ వలయును.

ఈలోకములో నారోగ్యమే మహాభాగ్యము. దానితో సమాన మయినది మఱియొకటి లేనేలేదు. ప్రతిదినము, తప్ప కుండ, వీలగునంతవఱకుఁ, గొంచెమయినను, శరీరసాధకము, చేయుచుండవలయును. ఉదయమునను, సాయంకాలమునం దును, పర్వతములు, నదులు, పొలములు, పచ్చికబయళ్ళు, గలప్రదేశములకు, బోయి, వచ్చు చుండవలెను. మనశరీరము ఇల్లు, కట్టుకొనుబట్టలు, సాధ్యమగునంతవఱకు, శుభ్రముగా నుండునట్లు చూచుకొను చుండవలయును. ఈసంగతు లన్నియు నితరులకుఁ గూడ బోధించుచు నుండవలయును.మనమునివసించు నిండ్లలోనికి, నన్నివైపులనుండియు, వెలుతురు బాగుగా వచ్చు నట్లేర్పాటులు చేసికొనవలయును.

అంతేకాకుండ, ముఖ్యముగా, మనస్సు పరిశుద్ధముగా, నుండునట్లు చూచుకొనుచుండవలయును. మనస్సులో, దుశ్చింతలు, చేరకుండునట్లు చేసికొనుచుండవలెను. మాన్యములున్నను, ధనమున్నను, నగలున్నను, నగరులున్నను, ఎన్నియున్నను, మనస్సునకు సుఖమును, శాంతియును, లేకపోయిన యెడల నన్నియును వ్యర్థములే. సుఖమంతయును, ముఖ్యముగా, నారోగ్యమువలననే కలుగుచున్నది. ఇది నిశ్చయము. వేళకు భోజనము చేయవలయును. వేళకు నిద్రింపవలయును. ఉదయముననే, నిద్రనుండి లేవవలెను. ప్రతిరోజునను దప్పక స్నానము చేయుచుండవలెను.



# జ్ఞానభాస్కరము

## నాల్గవ ప్రకరణము.

---

ముఖ్యముగా నందఱును, మత్తుపదార్థములను దరికి రాకుండఁ జేసికొనవలెను. అప్పుడే యారోగ్యము. అప్పుడే సుఖము. అప్పుడే యానందము. దయచేసి, శ్రద్ధగా, వినఁ గోరుచున్నాను.

గీ. కల్లు, బ్రాందియు, మత్తును గలుగఁజేసి,
గోల పెట్టించు, భార్యను, గొట్టఁ జేయుఁ,
దల్లి, బిడ్డయు, నని, దయఁ దలఁప నీక,
పాపకార్యము చేయించు; వలయు విడువ.

గీ. కారణమె లేక, నవ్వులు, గలుగఁ జేయుఁ;
గారణమె లేక, యేడ్పులు, గలుగఁ జేయుఁ;
దూలఁ జేయును, వెఱ్ఱిగాఁ బేలఁ జేయుఁ;
దిట్టఁ జేయించు, నెల్లరఁ, గొట్టఁ జేయు.

గీ. కారణమె లేక, భీతినిఁ, గలుగఁ జేయు;
వెక్కిరింపఁగఁ జేయును, వేఁడఁ జేయుఁ;
జనుచు, నీడను గనుచుండ, నరగఁ బట్టఁ
జేయుఁ, జేయించు నాట్యముల్, చిత్రగతుల.

గీ. "సకలలోకంబులం గలసాగరములు,
గల్లుగా, మారు, నాహాహా! యుల్లమందు,
నెంత సుఖ మైనఁ, గలుగదే యిహామున?" నని
పాటఁ బాడించు చుండును, బ్రియముద మెసఁగ.

గీ. పత్తెజంగుల శ్రేష్ఠను వంకఁ జేయు;
వెఱ్ఱిచూపులు గలిగించు, వింతగతుల;
అక్కఁకోనఁ జేయు, నెచ్చోట, మిక్కుటముగ;
నవశములుగఁ జేసెను, నెల్లనవయవముల.

గీ. నిల్వరించును, వింతగా, నిశ్చలముగఁ;
బరుగు లెత్తించుఁ, జూడఁగను, భయముఁ జెందఁ;
గూలఁబడఁ జేయు, లీలగా, నేలమీఁద;
గాఢనిద్రను గలిగించు, మూర్ఛఁ జేసి.

గీ. తిండి లేకుండ, నుపవాస, ముండఁ జేయు;
నానఁ బోనాడి, పుల్లెల, నాకఁ జేయుఁ;
బరులు హాసియించునట్లు, దిగంబరునిఁ జేయు;
శ్వాన మొఱగింప. నదె, నరుఁ, బసువుఁ జేయు.

గీ. దొరలఁ జేయును, జాలిగా, బురదయందు;
మునుకఁ జేయును, జలముల, ముసుకు నిడుచు;
ముసుకు నిడుచుండ, నిప్పుల, మునుకఁ జేయు;
మత్తుగతు లన్ని, సుఖములే, మదిఁ దలంప.

గీ. వర్ణధర్మంబు లెల్లను, బదటఁ గలుపు;
వ్యసనముల నెల్ల, మనసునఁ, బొసఁగఁ జేయు;

జీవితం బెంతొ! భారంబె, చేయుఁగాదె?
పానమహిమంబు వర్ణింప, వశమె యగునె?

గీ. జూద మాడించు, దొంగిలఁ జూడఁ జేయుఁ;
బలుకఁ జేయు నసత్యముల్, బహువిధముల;
ధర్మమార్గంబు, మానియుండఁగ, మలిన నుండ
హత్య లొనరింపఁ జేయును; హింసఁ జేయు.

గీ. ముచ్చ టెంతయుఁ గలిగించు, మొట్టమొదట;
భార్య, బిడ్డలు, బంధువుల్, వగటుఁ జెంద,
వివిధరోగముల్, తుద కెన్నొ! వెతలఁ జేసి,
మంచ మెక్కింపు, సుఖ మెల్ల, మంటఁ గలుప.

గీ. అల్ప మల్పంబె, యారంభ మగుచు మొదలి,
యంత కంతకు, వ్యసనంబు లధిక మగును;
పెద్దవారలె, మిత్రులె, పేరు గాంచి,
సౌమ్యుఁ డై వర్తించు, బోధింపఁ, జూచు మంత్రి.

గీ. ధనము పోకార్చుఁ; దెలివి దగ్ధంబు చేయు;
గౌరవంబును, బలమును, గాసిచేయు;
శీఘ్రమరణంబు, మనుజులకు, వెంటఁ జేయు;
మత్తుద్రవ్యంబు నిరతంబు మానవలయు.

గీ. పాన మొనరించు చుండెడుమానవుండు,
మత్తు తల కెక్క, నెంతయు, మనసు చెడుటఁ,
జెప్పరాని దుష్కార్యముల్ చేయు నెన్నొ!

మత్తు దొలంగఁ, దెలివి గల్గి, మనసునందుఁ,
దనదు కార్యంబులను గాంచి, వనటఁ జెందు.

గీ. తాగుఁ బోతులదరిఁ జేరి, తగదు నిలున;
మాటలాడంగఁ గడఁగినఁ, జేటు మూఁడు;
కూడ వయినను, వారలఁ, జూడ కుండి
తొలఁగి, యరుగంగ వలయును, దెలివి గలిగి.

పరంజ్యోతిరావు:— స్పీక్ డిడ్! ఆరోగ్యరావుగారూ! నేను మాకు మహాసుదినము. మీయుపన్యాసపరివాహమునకు, నే నడ్డమువచ్చినందుకు, నన్ను క్షమింపవలె నని, మిమ్ముఁ బ్రార్థించు చున్నాను. కొంచెమునేపు, తమరు విశ్రమించిన నొకల, దారకరామ్ టోపీదాసుగారితోఁ। గొంచెము మాటా డవలసి యున్నది. పదినిమిషములు వ్యవధి దయచేయవలయు నని కోరు చున్నాను. పనియున్నది. త్వరగా వెళ్లవలెను.

ఆరోగ్య:—సరే. మీరు కోరినప్రకారముగా , గొంచె ముసే పొగెదను. ఆలాగున గాదు. తమవంటి రసగ్రహణపారీ ణులు వచ్చినందుకు, నాకుఁ జాల సంతోషముగా నున్నది. సభ ముగింపఁబడువఱకును, దమరు కూడఁ, దప్పక యుండవలెను. అదియే నాకోరిక. తరువాతఁ దమచిత్తము.

పరంజ్యో:—చిత్తము. తమసెలవుప్రకారమే చేసెదను.

తారక:—ఓరీ! పరంజ్యోతిరావూ! క్షేమమా? ఎప్పుడు వచ్చినావురా? ఇన్ని సంవత్సరము లేమయినావురా? ఇన్‌స్పెక్షన్ డేస్‌లోనే మానివేసినా వేమిరా?

పరంజ్యోతి:— ఏమి చెప్పను? ఇన్స్పెక్షన్ డేస్‌లో, స్కూలుకువచ్చుట, రెండుమూడుసంవత్సరములనుంచి, మామూలే లేదని యెఱుగవా? ఐన నీరోజులలోఁ, బిల్లలనెక్కువగాఁ బరీక్షచేయుటకంటె, నుపాధ్యాయులు, పిల్లలకు బోధించుపద్ధతులనే, యెక్కువగాఁ బరీక్ష చేయుచున్నారు గదా! అదియే చాల బాగుగా నున్నదిసుమా! పూర్వకాలములలో, మాస్టరు జోలికే వచ్చువారుకారట! ఆకాలములో, నుపాధ్యాయులు, బొమ్మలవలె నిలుచుండిరో! కూర్చుండిరో! యిటునటుఁ దిరుగుచునుండిరో! యుండెడువారట!

నాసంగతి మహాఅధోగతిపాలయి పోయినదిసుమా! నేటికి, దైవము; నాపాలిట నున్నాఁడని, యనుకొనుచున్నాను. ఎఱుగుదువుకదా! మనము మొదటఁ జదువుకొనురోజులలో, నేను, హాఫ్ ఆర్ఫనునేకదా! తరువాత, నిహలోకదైవమువలె, నెల్లప్పుడును, నాసుఖముకొఱకు నెంతయుఁ గష్టపడు చుండిన వృద్ధురాలగుమాతల్లిగారుగూడఁ, గాలము చేసినందున, నిప్పుడు, ఫుల్‌గా, ఆర్ఫను నయిపోయినాను. ఒక్కఁడే, యీలోకములో నయిపోవువానికిఁ, గష్టమును, సుఖమునుగూడ నున్నవిసుమా! “ఏనుఁగంతతండ్రికంటె, నేకులబుట్టంతతల్లి చాలమే” లనుసామెత నిజమేఁగనిదిగాను. ఆధార మేదియులేక పోవుటచేత, జరుగుపాటులేక, చదువు మానివేసినాను. అప్పటి నుంచియు, మావేదాంతగారిమఠములోనే యుండి, మాచి౨ యింటిలోనే, యేలాగుననో కాలము గడపుచున్నాను, నాకీ

నస్థితికి జాలిపడి, మాబంధువర్గములో నొకరు, నామీఁదఁ జాల దయగలిగి, భోజనముపెట్టు చున్నారు. పరాన్నము, గౌరవము నకు హానియేసుమా! ఎంతకాల మితరులయింట నూరక భోజనము చేయు చుండఁగను?

ఈలోక మొకగొప్పవలవంటిదిగదా! అందులోఁ జేఁపవలెఁ బ్రాణులనియుఁ, గిజగిజ కొట్టుకొను చున్న వని, మన మెఱుఁగుదుముకదా!

అలాగున నుండఁగా, నెక్కడనుండియో, మనఅయోమయముగాఁడును, అమ్మయ్యలింగముగాఁడును, మాగ్రామమునకు వచ్చి, మిట్టమధ్యాహ్నమువేళ, నన్నుఁ గలసికొని. "ఈలాగున నెందుకురా కష్టపడు చున్నావు? మనతమూంపాపట్టణములో, మనక్లాసుమేటును, మనకుఁ జిరకాలస్నేహితుఁడును, అయిన తారకరా మిప్పుడు, మిక్కిలి గొప్పదశయం దున్నాఁడు. నీయందు వాని కెంతయో స్నేహము గలదుగదా!

ఇప్పుడు మనము మద్రాసుకు వెళ్ళి, వానిని జూచిన మొదల, మనకు మంచిజీవనోపాయము దొరకఁ గలదు." అని చెప్పుటచేత, మావారితోఁ జెప్పి, యానిమిషముననే బయలుదేరి, యీపట్టణమునకు నేటిసాయంకాలమునకు వచ్చి, సీతారకాశ్రీమములోఁ గనుగొనఁగా, నీ విప్పుడు, "ఆరోగ్యము"ను గూర్చి, జరగు చున్నసభలో నున్నా వని, యొకరు చెప్పినందున, నిక్కడకు వచ్చి, నిన్నుఁ గలసికొన్నాము.

ఆహా! సీతారకాశ్రమ మెంతమనోహరముగా, నెంత శాంతిదాయకముగా నున్నది. అక్కడ నై దునిమిషములే నిలిచి, యందలివివిధములయిన పూలచెట్లను, నానావిధఫలవృక్షములను, జూచుచుండఁగా,, నామనస్సులోనివిచార మంతయు, నేలోకమునకుఁ బోయినదో పోయినది!

ఆకారణముచేతనేకదా! కొందఱు బుద్ధిమంతులు, సంసారాదిసుఖములను విసర్జించి, తమధనముతోడనో, లేక, యెక్కడనో యాచించి తెచ్చుకొనినధనముతోడనో, యెందుకోయని తెచ్చినధనముతోడనో యెక్కడనో శాంతిస్థలము నొకదాని నేర్పరచుకొని, యేమఠమునో యేయాశ్రమమునో, నిర్మించుకొని, యేభగవద్గీతనో, లేక, యేయోగవాసిష్ఠమునో, యేశ్రీరామకర్ణామృతమునో, యేశ్రీకృష్ణకర్ణామృతములనో, చదువుకొనుచు, వేళకు సుఖముగా భోజనముచేయుచు, నేకాంతసుఖజీవనము చేయు చుందురుసుమా!

తారక:—మంచిపని చేసినారు. సమయమునకు వచ్చినారు. నేనుగూడ, మిమ్ములనుగుఱించి, నెలదినములనుంచి, యాలోచించు చున్నాను. అడ్రెస్ తెలియనందున, నుత్తరము వ్రాయలే కున్నాను. కాని మీగ్రామములో నివసించుమహాభోగరాజుగారు బాగుగా నున్నారా?

పరంజ్యోతి:—ఏమి చెప్పను? పాపము, నేటికి, మూడుమాసములక్రిందట, నారోగ్య మంతయుఁ జెడిపోయి, కాలము చేసినారఁట. తండ్రిగారు చనిపోవునప్పుడు, నాలుగులక్షల హాస్తు

క్యాష్ గలనాలుగు పెద్దయినుపపెట్టెల నొప్పగించినారు. పాపము, తండ్రిగారు, కాకగానుండినఁ జలువగానున్నదనియుఁ, జలువగానుండినఁ, గాకగా నున్నదనియు, మందులమీఁద మందులు గుప్పించి, వందలకొలఁది న్యాపాయులు బహుమానముగాఁ బొందినవైద్యశిఖామణులయొక్క తెలివిచేత, నుబ్బరోగము ప్రవేశించి, సోడాబుడ్లమీఁద సోడాబుడ్లు, లెమనేడ్ బుడ్లమీఁద లెమనేడ్ బుడ్లు, ప్రతిరోజునను, లెక్కలేనన్ని త్రాగి త్రాగి, మూఁడుమాసములు చాలబాధపడి, చనిపోయినారు.

తరువాత, మహాభోగరాజు, తనవంటయిల్లేమో, మధ్యహాలులో నున్నయానాలుగుయినుపపెట్టెలయెదుట వేయఁబడిన యీజీచేర్ మీఁదఁ గూర్చుండుటయేమో, సాయంకాలము, నాలుగుగంటలకుఁ, దినలేక తినలేక, రెండుమూఁడు గోధుమ పూరీలు తిని, సోలెడు గోరువెచ్చని చిక్కనియావుపాలు త్రాగుటయేమో, పేపర్లని వచ్చు చుండునుగదా! అవి చేతఁ బుచ్చుకొని, గిరగిర తిరుగుకుర్చీమీఁదఁగూర్చుండి, తనలో దాను నవ్వుకొనుచుఁ, గునుకు చుండుటయేమో! అంతే. వాఁ డెప్పుడును, వీధిగుమ్మ మయినను దాటెడువాఁడే కాఁడు. అరుగు లయినను దొక్కి చూచెడువాఁడు గాఁడు. కొంచెమయినను, దనయారోగ్యవిషయమును చూచుకొనెడువాఁడే కాఁడు. ఆకారణముచేతనే, వాఁడు, క్రమక్రమముగా, శరీరములోనిరక్త మంతయు, శుభ్రముగాఁ జెడిపోయి, పాలిపోయి చిట్టచివరకుఁ, దెల్లగా నేకులాగు మారిపోయినాఁడు. చివర

కజీర్ణరోగము ప్రవేశించి, యూపిరిజబ్బు బయలుదేరి వాఁడు గూడ,

గీ. తనకుఁగలిగినధనమును, దానె, తినక,
సాయ మింతయు, నొరులకు, సలుప కుండి,
సొమ్ము పెట్టెల, మూటియుచుఁ, జూచు చుండి,
విడిచెఁ, బ్రాణంబు లాశచే, విడువలేక.

వాఁడు నాకుఁ జాల ప్రాణస్నేహితుఁడు. ఏమనునో, చూత మని, యొకసారి, బాలిష్టరుపరీక్షకు లణ్డన్ వెళ్ళెదనని గావలసినంతసొమ్ము, పదివేలయిన, నిరువదివే లయిన, సాయము చేసెద నని, వాగ్దానము చేసినాఁడు. ఇంతలో సీలాగున జరుగ వలసి యున్నది. ఏదివచ్చినను, మంచికే వచ్చునుసుమా! పాపము వాని కొక్కతల్లిమాత్ర మున్నది!

పిమ్మట, నానాలుగులక్షల రూపాయలనుగూర్చియు, నున్న యేఁబదియెకరముల మంచి పంటభూమినిగూర్చియు, మూఁడంతస్థుల మేడనుఁగూర్చియు, నగలు మొదలగువానిని గూర్చియుఁ, దల్లియును, మేనమామలును, న్యాయసభల కెక్కి, యిప్పుడు, హోరాహోరిగఁ, బోరాడు చున్నారు.

ఆందోళనముమాట, శ్రమమాట, బుజములు గాయలు గాయునట్లుగాఁ జేయురికార్డుల మోఁతమాట, ముందుగా ఫీజుఫీజనుచుండెడు న్యాయవాదుల యిండ్లయొక్కయు, మేడల యొక్కయు, మెట్లెక్కుటయందును, దిగుటయందును గల యాయాసముమాట, యట్లుండఁగా, నున్నసొమ్మంతయు

న్యాయవాదులచేతులలోకి గోత్రిగోదావరివలె, నొకటియేప్రవాహమువలెఁ, బ్రవహించిపోవు చున్నది. ఏమిచెప్పను? చెప్పిన కొలఁది నెంతయైనను విచారము గలుగు చున్నది.

తారక:—ఓరీ! ఎంతవిచారకర మయినసంగతి చెప్పినావురా! ఇంతేసుమా లోకము!

పరంజ్యో:—మాతల్లిగారు, కాలము చేసినపిమ్మట, మాయూరిలోనివారు చాలమంది, పుణ్యము మూటకట్టుకొని రావలయునను నుత్సాహముతో, మార్గములలోఁ, గాళ్ళు, నెత్తియు, మాడు చున్నను, వేగానివేళయందుఁ, బచ్చిపులుసు మెతుకులతోఁ గాశికి వెళ్ళిన గాశికి వచ్చినాను. జగన్నాథము, వెళ్ళిన, జగన్నాథము వచ్చినాను. రామేశ్వరము వెళ్ళిన, రామేశ్వరము వచ్చినాను. ఈప్రకారముగా, గష్టసుఖములు బాగుగా మనస్సున నాటించుచు లెక్కలేనన్ని యుత్తరాది యాత్రలును, దక్షిణాదియాత్రలును, మనదేశమునందలి పుణ్యక్షేత్రము లెన్నియో! చూచినాను. ఎన్నెన్ని దేవాలయము లెన్నెన్నిచిత్రములు చూచినాను! ఎన్నెన్నిరకములప్రసాదము లయినను దినియుంటిని. ఆరుచు లన్నియు, నానాలుక నింకను, విడువక యే యున్నవి. ఎప్పుడయిన నింకొకసారి తిరిగిరావలయు నను కోరిక గలుగు చుండును.

స్వమతాభిమాన మనువది లేశమయినను లేక, ఐడల్ వర్‌షిప్, ఫూలిష్‌నెస్, అని యందురుగాని, యన్నివిధముల సంభవించు నానందసుఖములు, వారికేమి తెలియఁగలవు?

చాల డబ్బు ఖర్చుపెట్టి, చేయించినారు. ఊరేగింపుసమయము లలోఁ, బ్రతివాహానమునకు నెదుట, నొక్కొక్కమేళము సాగు చుండునప్పుడు, పట్టణములో నుండుపిల్లలేమి, పెద్దలేమి, కల కలలాడుమొగములతో, దేవునితోఁగూడ, మహాసంతోష ముతో, నెమ్మదిగా నెమ్మదిగా, నడచుచు వచ్చు చుందురు. ఓనురా! ఏకార్య మయినను జేసినయెడల నాలాగుననే, యుత్సాహకరముగఁ జేయవలయును, అప్పుడే నిజ మయినభక్తి. అప్పుడే నిజ మయినవిశ్వాసము.

తరువాత, నింకొకరిఘర్మేషణచిత్రము చూడండి! పురు షులును, స్త్రీలు నొకదేవాలయమునకే పోవు చున్నయెడల నొకరి నొకరు ద్రోసికొను చుండుటయు, మర్యాదకు భంగ కరముగా నుండుటయుఁ గలుగు మండు నని, చక్కఁగా నాలో చించి, స్త్రీలకొఱకుఁ బ్రత్యేకముగా, సరస్వతీదేవాలయమును, లక్ష్మీదేవాలయమును, పార్వతీదేవాలయమును, గట్టించినారు. ఇట్టివిచిత్ర మయినయపూర్వమైనమార్పునకు, మొట్టమొదటఁ, బట్టణములోనివా రందఱును, ఆర్యాచారమును ద్రోసివేయఁ గూడ దని, చాలఁ బట్టు పట్టినను, గాలక్రమంబున నంద ఱాలో చించి, యీమార్పుపరికారముగాఁ, సంతోషముతోఁ బురుషు లును, స్త్రీలును, వేఱువేఱుదేవాలయములకే పోవుచు, ఫలా దులను, దక్షిణాలను, సమర్పించు చున్నారు. ఇది మంచియే ర్పాటు గాదా? బాగుగా నాలోచించి చూడుము.

— ♦ —

# జ్ఞానభాస్కరము

## ఐదవప్రకరణము.

---

పట్టణమునకు నాలుగువైపులను, బిల్లలు చదువుకొనుటకు, నాడుకొనుటకు, నాలుగుపాఠశాలలు స్థాపించినారు. మొట్టమొదట, గొంతకాలము, పట్టణములోనిపురుషులేమి, స్త్రీలేమి, బాలికలకు విద్య గూడ వలెనని, „బాలికలు విద్య నేర్చుకొని, యుద్యోగములు చేసెదరా? ఊళ్లేలెదరా?” యని, „వద్దు వద్దని కొంతిపట్టు పట్టెను, సెట్టిగారుదానుగూడనాకొంతి పట్టే, పెద్దపట్టుపట్టి, విద్య పురుషులకును, స్త్రీలకునుసమానముగా, ముఖ్యమని నష్టమునకయినను గొంచె మయిన నాలోచింపక, కొంతకాలము వ్యాపారమునహిందము మానివేసి, యందఱితో వాదించివాదించి, చిట్టచివరకు వారి నందఱి నొప్పించి, బాలిక లకుఁ గూడ, నాలుగుపాఠశాలలు, ప్రత్యేకముగా స్థాపించి నారుసుమా! ఎంతధనవంతుఁడో! ఎంతపరోపకార చింతగల వాఁడో! చూడండి! ఇప్పుడు, నేనే, మాయన్నివ్యవహారము లను జూచు చున్నాను. అన్నిటికంటె నెక్కువగాఁ, గోర్టువ్యవ హారములు, నాతలలోనినరములను, దోడివేయు చున్నవి. ఇప్పుడు, నాకు మీరు ముగ్గురును, మూడుశిరస్సులవలె, గొప్ప సహాయములుగా వచ్చి యున్నారు. నా కెంతయు సంతోష

ముగా నున్నది! ఇంక, నేను జతుర్ముఖబ్రహ్మ నయితి నని యుత్సాహముతో ననుకొను చున్నాను. ఇదంతయు నీశ్వరేచ్ఛయేసుమా!

మనముచూడవలసినవి, పాఠశాలలు, దేవాలయములు, సత్రములు నెన్నియెయో యున్నవి. పాఠశాలలలోనిపిల్లలు, సరిగ వచ్చి, బాగుగాఁ జదువుకొనుచున్నారో, లేదో, మీరు మిక్కిలి జాగ్రతగాఁ జూడవలసి యున్నది. ఉపాధ్యాయులు, దాము చెప్పవలసినపాఠముల నింటియొద్ద నథము మొకసారియైనఁ జూచి వచ్చు చున్నారో, లేదో, చూడవలసి యున్నది. కొంద ఱుపాధ్యాయులు, పిల్లల కేదియో పనికల్పించి, తా మేలఘుకొను దినో, ఏమనుచరిత్రమునో, ఏపేపరో చదువుకొను చుందురు. కొందఱు, పాఠశాలకు, "ఉస్సు" "అస్సు" అనుచు వచ్చి కుర్చీలమీఁదఁ గూర్చుండి, కునుకుచు నుందురు. ఎక్కు వతిండి వలననో, సీసమువలననో, బద్ధకముచేతనో, మనోవిచారము చేతనో, చూచునా రెవరును లే కుండుటచేతనో, తాముచేయ వలసిన విధులను జక్కఁగాఁ బాటింప నుండుటచేతనో యాలా గునఁ జేయు చుందురు.

అదియేపరిగ నాటలు వల్లపడదని నాయభిప్రాయము. అసలే యాటలులేకుండ నుండఁగూడదని నాయభిప్రాయము. పిల్లలకుఁ గ్రిమ మెఱుఁగ న్యాయమునుఁ గట్టిశిక్షయుండవలయు ననియే నాముఖ్యాభిప్రాయము. దేశాభివృద్ధిభార మంతయు

మనపిల్లలకుగూడనే యున్న దని మనముగ్రహింప వలసి యున్నది.

ఇంక దేవాలయములు మాతండ్రిగారు చనిపోయి, స్వర్గములో నేమూల సుఖముగా నున్నారో కాని, యాయన బ్రతికియున్నప్పుడు, నాచిన్నతనములో బదునెనిమిది పురాణములనుండియు ననేక విషయములనుగురించి చెప్పుచు నుండెడు వారు. అందులో దేవాలయము లొకటి. కలియుగమహాపురాణమును దెనిగించిన బుద్ధిమంతుఁ డయిన యామహాకవీశ్వరుఁడు, వ్రాసినాఁడో లేదో, లేక, వ్రాయఁదలఁచి, మఱచి పోయినాఁడో కాని, ముందు వచ్చుపూజారులలో ననేకులు దేవుళ్ళ యొక్కయు, దేవతల యొక్కయు, దేవాలయముల యొక్కయు, నిండ్లు, భూములు, నగలు, మొదలగునాస్తులు, తమతాత ముత్తాతల యాస్తులవలెనే, తాకట్టుపెట్టుకొనుట, యమ్మివేయుట, యమ్మివేసి కొత్తవి కొని తమపేరవ్రాయించుకొనుట, మొదలగు నక్రమసాహసపాపకార్యములు చేయుచుందు రని చెప్పెడువారు. ఇవన్నియు, మీరు, బహు జాగ్రతగాఁ, జూడవలసి యున్నది.

ఇంక సత్రములు, ఇందులో జరగుసంగతు లన్నియు, నందఱికిని, దెలిసినవియే యయినను, దెలియనట్లుగనే, యూరకొను చుండవలసియే యున్నది. సత్రములకుఁ గావలసిన బియ్యము, నెయ్యి, కూరగాయలు, వంటచెఱకు, మొదలగున

వన్నియు, నింతటినుంచి, మీరే స్వయముగాఁ గొనుచుండ వలయును.

మనప్రాణములు దీసివేయుటకే, ధర్మాలసెట్టిగారిన్ని పుణ్యకార్యములు చేసినారనుకొనక, ప్రతివిషయమునందును, మిక్కిలి జాగరూకతతోను, న్యాయదృష్టితోను, మీామీాపను లన్నియుఁ, జూచుకొనుచు, నాకును, మీకును, మంచిపేరు వచ్చునట్లుగాఁ, జూచుచు, నుండవలయు నని నాకోరిక. మీా యెడల నా కెంతయినను నమ్మక ముండుటచేతనే, యీయన్ని పనులయందును, మిమ్ముఁ బ్రవేశపెట్టుచున్నాను. ఈయన్ని విషయములలోను, ఏవిధ మయినయన్యాయములు జరగు చున్నట్లు తెలిసినను, మనపట్టణ మేలుచున్న త్రిలోకచంద్ర మహారాజుగారు, మనలనూరక, పోనిచ్చువారు గారు. మన ప్రాణములకుఁ గూడఁ బ్రమాదము సంభవింపవచ్చును. ఆకా రణముచేతనే, మీాతో నింతగాఁ జెప్పవలసివచ్చినది.

న్యాయముగా నడచుకొనువాని కేవిషయమునందు నింతయు భయము లేదుగదా!

ఇప్పటికి నాకాశముక్రిందనే, యల్లాడు చున్నధర్మాల సెట్టిగారియాత్మకు, సంపూర్ణశాంతి గలుగుటకై, యిప్పుడు, నవగ్రహపూజ ముఖ్య మయినదిగాఁ గనఁబడు చున్నది. మీారు ముగ్గురును, మూాడేసిగ్రహములపూజమీాద సూపర్వైజ్ చేయ వలసియున్నది. పూజలు చేయుబ్రాహ్మణోత్తములు, మంత్ర ములు సరిగఁ జదువుచున్నారో, లేక, త్వరితముగా లేచిపోవలె

నని, మంత్రములు దాటించివేయు చున్నారో, యొక్కసారిగా, గుప్పిళ్లకొద్ది పువ్వులు పూజచేయు చున్నారో, లేక, యొక్కొక్కపువ్వే పూజ చేయు చున్నారో, గ్రహములు దదేకదృష్టితోఁ జూచుచుండునట్లుగా, జేగంటలు, నిమిష నిమిషమునకును, సత్తువకొలఁది, గట్టిగా, గణగణమ్రోయించు చున్నారో లేదో, మీరు జాగ్రత్తగాఁ జూడవలసి యున్నది. ఇంతటినుంచి, పూజకుఁ గావలసినకొబ్బరికాయలు, అరటిపండ్లు, బెల్లము, గోధుమనూక, పంచదార, అగరువత్తులు, సాంబ్రాణి, హారతి కర్పూరము, నెయ్యి, అన్నియు, మీరే కొనుచుండవలయును. వారమునకొకసారి లెక్కలు నాకుఁ జూపించుచు నాచేత సైను చేయించు చుండవలయును.

ఇదిగో! చీటి, నేటినుంచి. యొక్కొక్క రోజున, నొక్కొక్కసత్రములో భోజనము చేయు చుండవచ్చును. ఆలాగునఁ జేయుటవలనఁ, బ్రతిసత్రములోను జరుగు చుండుసంగతు లెప్పటికప్పుడు నాకు బాగుగాఁ దెలియు చుండును. అన్ని సత్రములలోను బనులుచేయుబ్రాహ్మణు లుండవలయును, నెమ్మదిగలవారును, బాగుగా వంటచేయుటయం దెంతయు నేర్పుగలవారును, దినువారికిఁ గావలసినంత యుత్సాహముతోను, బ్రేమతోను వడ్డించువారు నయి యున్నారు.

రోజులు మంచివి కావు. కాఁబట్టి, యన్నిటిలోను, నేయియే యుపయోగించు చుండవలసిన దని, యీమధ్యనే యొకగట్టియాజ్ఞ నన్నిసత్రములకుఁ బంపి యున్నాను పుణ్య

కార్యములయందుఁ, గలగలుపువస్తువు లుపయోగించి, మన మేలు పాపము గట్టుకొనవలెను. సామాన్యమైన కేమయినను లోటు లేదుగదా! అందఱును సుఖముగాఁ దినుచుండుటకుఁ బుణ్య కార్యములు చేసినయాసెట్టిగారి కిప్పు డేమహాపుణ్యలోకము లలో నున్నారో కదా!

వీటి కన్నిటికి నేమి కాని, సెట్టిగారు గట్టించిన మోహినీదేవతాలయము, ఒకమహాదివ్యభవనము. అది జూచి తీరవలెను. అందులోఁ బ్రతిశుక్రవారమునను, జరుగుకుంకుమపూజ, హరికథలు, పురాణశ్రవణము, మేళములు, భజనలు, ముఖ్యముగాఁ బ్రసాదములు, సంతోషానందకరములుగా నుండునో నే నిప్పుడు మాటలలోఁ జెప్పఁ జాలను.

పరమేశ్వరి:—ఏమో! ఇది యాశ్చర్యముగా నున్నది! ఎంతోదేశ మును జూచినాను. ఎన్ని దేవుళ్ల పేళ్ళయినను విన్నాను. ఎన్ని దేవతల పేళ్ళయినను విన్నాను. ఎందఱెందఱు భక్తుల నయినను జూచినాను. కాని, మోహినీదేవత పే రెక్కడను వినలేదు. వినుట కిదియే మొదటిసారి. ఆసంగతిఁగూడఁ గొంచెము చెప్పుము. వినుటకు నామనస్సు చాలఁ గుతూహలపడుచుఁ దొందరపడు చున్నది.

తారక:—అదిగో! ఆరోగ్యరావు, "ఎనఫ్ ఫ్రెండ్స్!" అని బెల్ కొట్టఁబోవుచు, మనయందలి స్నేహభావముచేతను, గౌరవముచేతను, గొట్టకుండ, నూరకొని యున్నాఁడు. బెల్ కొట్టకుండఁగనే, మనము సంభాషణము చాలింపవలెను.

తల్లిగారును, బ్రతిదినము, పసుగువిరామములు లేకుండ భోజనముచేయుచును, భోజనముచేసినతరువాతను ఏకదీక్షగాఁ బోరాడుచు నుండెడువారట! పాప మీలాగున నింట శాంతి గొంచెమయినను లేకుండఁ, గాలము గడచిపోవుచుండఁగా, వివాహముగాకపూర్వమే, మోహిని పదియవయేటనే తల్లిదండ్రుల నపారమయినదుఃఖసముద్రమున ముంచివేసి, కాలధర్మము పొందినదట!

అట్టిమహాత్మురాండ్రు, చనిపోయినతరువాత, దేవతలగుదు రని యెఱుఁగుదువుగదా! పెద్దలు చెప్పుకొనుటయయి ననువినలేదా? అల్లామె దేవత యయి, నివసించుటకై, దేశమంతయుఁ దిరిగితిరిగి, చిట్టచివరకు, ధర్మాలసెట్టిగారి ముత్తాతగారిముత్తాతగారు నిజామురాష్ట్రములోని గొప్పచింతతోటను, దానికి సమీపమునగాఁ, గప్పులు చెదిపోవునట్లుగా, నతిమనోహరముగా నుండి, మనస్సును వికసింపఁ జేయునట్లు పెద్దపెద్దగుత్తులుగాఁ జక్కఁగా వికసించిన యెఱ్ఱనిపుష్పములుగల యొకగొప్పతురాయిచెట్టును జూచి, చాలసంతోషించి గొప్పగొప్పబలమైనకొమ్మలుగలయు నాచెట్టుమీఁదనివసింపనారంభించినది

తరువాతఁ, బ్రతిదినమును, రాత్రి తొమ్మిదిగంటలు మొదలుకొని, తెల్లవారుజామువరకు, వేదములును, శాస్త్రములును, ఒక్కస్వరమయిన, నొక్కపన్న మయిన, నొక్కభాగమయినను దప్పకుండ, బాగుగా స్పష్టముగా, నతిమనోహరధ్వనులతోఁ, జదువుచు నుండెడిదట! ఆదేవత, సామవేదము చదువునప్పుడు, చక్కనికోలాటపాటవలె నుండుటచేత, నాచెట్టు

మీాద నివసించుకొంగలు, చిలుకలు, గాకులు, మొదలగు పక్షులు, దమతమపిల్లలతో, సుఖముగా ముచ్చటలాడుకొనుచు గొంచెమయినను, మెలకువ లేక, హాయిగా నిద్రించు చుండెడి వట!

అదియంతయు, సెట్టిగారనేకపర్యాయములు, వెన్నెల రాత్రులయం దాలకించి చూచుచు, నేమియు భయ మనునది లేనిమహాఘోరవైశ్యశిఖామణి యగుటచేఁ, జింతచెట్టుమీాద దేవత ప్రవేశించిన దని, చక్కఁగాఁ దెలిసికొని, యప్పుడప్పుడు రహస్యముగా, మెల్లమెల్లగా భార్య కరుణాంభగారితోఁ, జెవిలోఁ జెప్పుచుండెడువారట! తరువాతఁ జుట్టుప్రక్క లగ్రామములలో భూతవైద్యు లని ప్రసిద్ధిఁ బొందిన మంత్రశాస్త్రజ్ఞులవలన చేయింపవలసిన విధానము లన్నియు నెన్నియో! చాలసొమ్ము ఖర్చుపెట్టి, చేయించి యుండిరి.

కాని, వారామహాదేవతను, స్వాధీనము చేసికొనలేకయే యుండిరి. మఱియు, వారాదేవతవల్ల ననేకపర్యాయములు, దౌడలును, వీపును, గంది వాచిపోవునట్లుగా, లెంపకాయలును, జెప్పుదెబ్బల నరచేతిచఱపులను, „అయ్యో! బాబో!” అని యనుచు, దినిరని. శ్రీమహావిష్ణువుయొక్క సుదర్శనచక్రమామహాకోపస్వభావముగల దూర్వాసమహామునిని వెంటాడించి, ముల్లోకములయందును జిత్రముగాఁ ద్రిప్పిత్రిప్పి, భయభ్రాంతునిగాఁ జేసి, బాధించినట్లే, యామోహినీదేవతయుఁ, దమ్ము వెంటాడించి, బాధించుచును నధికముగు భయము చేత,

నాటినుండియుఁ, జిరకాలమునుండి తమతమ వంశములయందు సుఖజీవనోపాయముగా, మాయోపాయముగా, వచ్చుచున్న భూతవైద్యపువృత్తిని మానివేసి, పెద్దపెద్ద కుంకుమబొట్లు పెట్టుకొనుటయుఁ, జేతఁ బేపబెత్తములు పుచ్చుకొని, వీధులలో దాంభికముగాఁ దిరుగుచుండుటయు సంపూర్ణముగాఁ గొంత కాలము మానివేసిరి. అందుఁ గొందఱుఁ భూతవైద్యమున కొక్క సాష్టాంగ నమస్కారముచేసి, యాయుర్వేదమును జక్కఁగా నభ్యసించుచుఁ వైద్యము చేయుటకుఁ బ్రారంభించి యక్కడక్కడ స్వతంత్రముగా వైద్యశాలలను స్థాపించుకొని, సుఖజీవనము చేయ నారంభించిరి.

కాని, యేదియెట్లు లున్నను, మోహినీదేవతయొక్క పరమానుగ్రహముచేతనే, యీపట్టణవాసుల కించుమించుగా సంకటికేని. దయ్యములయందు, గలవిశ్వాసము క్రమక్రమముగా దగ్గిపోవుటకుఁ బ్రారంభించినదిసుమా!

ఒరీ! ఈలోకములో, దయ్యము లనఁగా, మనుష్యుల మనస్సులయందుఁ గలుగుచుండు భయముతోఁ గూడిన పిఱికి తలంపులును, దెలివితక్కువ యాలోచనలునేసుమా! జ్ఞాపకముండి యుండవచ్చును: నీవొకసారి పదిసంవత్సరములక్రిందట జెప్పియున్నావు. మీగ్రామములో, నొకతెకుఁ దీవ్రజ్వరముచే సంధిప్రవేశింపఁగా, దయ్యము పట్టె నని, యత్తగారును, చినత్తగార్లును, నలుగురైదుగు రాముబిడ్డలును జేరి, యింటఁ బురుషు లెవ్వరును లేనిసమయమునుఁ జూచి, తలుపులు గట్టిగాబిగించి,

తలకొకచీపురును, జెప్పును, బెత్తమును, బుచ్చుకొని, చాల సేపు, స్వతంత్రివైద్యముచేసి కొట్టికొట్టి, ముక్కును, నోరును, మూసి, యూపిరి సలుపకుండఁ జేసి చంపివేసినారుగదా!

పరంజ్యోతి:—ఔను. జ్ఞాపకమునకు వచ్చినది. అం దుకుచేతనే, తరువాత మాత్రిలోక చంద్రమహారాజుగారు „ఇంతటినుంచి పట్టణములో నెవ్వరికయిన నేరోగము లయిన వచ్చినయెడల, నారోగములకు, దయ్యము లని పేరుపెట్టి చీపుళ్ళతోను, బెత్తములతోను, జెప్పలతోను, వైద్యములు చేయుటకు బ్రారంభించినయెడల, నట్టివారు కఠినముగా శిక్షింప బడుదు" రని, యొక గట్టియాజ్ఞను, బట్టణమునం దెల్లయెడలను, బాగుగా వెల్లడిచేయించి యున్నారు.



# జ్ఞానభాస్కరము.

## ఆఱవప్రకరణము.

---

తారక:—ఇలాగుప నుండఁగా, సెట్టిగారు, స్థూలకాయులగుటచేతను, మంచువేసవికాలమగుటచేతను, అందులో ఱోళ్ళు పగిలెడురోహిణీకార్తె యగుటచేతను, ఒకరోజురాత్రి రెండుకుంచముల మంచిగంధముతీయించుకొని, శరీరమునిండంతటను, ఒకభయంకరవేషమువలెఁబూయించుకొని, పరుండి, యెంతమాత్రమును నిద్రపట్టక, మంచము దిగి, తమపెద్దగదిలో, యీచివరనుంచి యాచివరవఱకు నాచివరనుంచి యీచివరవఱకును, వెఱ్ఱివానివలెఁ దిరిగితిరిగి, యేలాగునో, "ఉస్సు" "అస్సు" అనుచు బాధపడిబాధపడి మూఁడుజాములు గడపివేసి, బాగుగా నాలోచించి యాలోచించి, ప్రాతఃకాలము గాకముందే భార్యను లేపి, యిరువురును స్నానము చేసి, పట్టువస్త్రములను ధరించి, కుంకుమబొట్లు పెట్టుకొని, పెద్దపెద్ద వెండిమరచెంబులతో నీళ్ళు పుచ్చుకొని, దొడ్డియందలి చింతచెట్టునొద్దకు, వినయవిధేయతలతో నెమ్మదిగా నెమ్మదిగా వెళ్ళి, చెట్టుమొదట నీళ్లు పోసి, మూఁడుసార్లు ప్రదక్షిణములుచేసి, చేతులు జోడించుకొని, సాష్టాంగ నమస్కారములుచేసి, నిలుఁవబడి, యాకాశమువంక మొగములు త్రిప్పి

కన్నులుమూయుచుఁ దెఱచుచు, గడగడవణకుచు, భక్తి యుట్టిపడునట్టుగా, "ఓదేవీ! రక్షింపుము. మా కేహానియుఁ జేయ కుండుము. నీయొక్క విగ్రహము మంచి మేలిమి బంగారముతోఁ జేయించి, నీపేర నొక దివ్య మయిన దేవాలయమును గట్టించి, ధూపదీప నైవేద్యములకుఁ గావలసినంత భూమికూడ నిచ్చెదను. పదివేలరూపాయలనగలుగూడ సమర్పించెదను. రక్షింపుము. రక్షింపుము. తల్లీ!" యని మ్రొక్కుకొని, యాలాగుననుకొనినప్రకారముగానెంతసొమ్మయినను గర్చుపెట్టి, యొకదివ్యమయినదేవాలయమును గట్టించి, మ్రొక్కు దీర్చుకొనియున్నారు. నాటినుండియు నాదేవత, వారి కులువేల్పయి, "ధనాలవారిదేవత" యని దేశములో నెల్లఁ బ్రసిద్ధి నొందుచు, వారిని సర్వవిధములఁ గాపాడు చున్నది. మిగిలినకథయెప్పు డయినను జెప్పెదను. ఇంతేల, నా తారక మంత్రప్రభావముచేతనే, యామోహినీదేవతను స్వాధీనము చేసికొని, యందఱిభయమును దీర్చి, మేలే చేయునట్లు చేసినాను.

ఆహా! దేవుళ్లకును, దేవతలకును, నిజమయినభక్తులయెడల నెంతప్రేమ యుండునో చెప్ప నలవియే కాదు. మఱచి పోయినావు కాఁబోలు! మనము పాఠశాలలలోఁ జదువుకొని యున్న "కుచేలోపాఖ్యానము" "గజేంద్రమోక్షము", "ప్రహ్లాద చరిత్రము" "అంబరీషోపాఖ్యానము" జ్ఞాపక మున్నవిగదా! ఎఱుఁగుదుము. నీ కెప్పుడును, బురాణకథలయం దెంతమాత్రమును, విశ్వాస మనునదియే లేదుగదా! పద్యములు శ్రీవణా

సందకరముగాఁ జదివి, ,,అహాహా! ఓహోహో! యని, కవిత్వ మునకుమాత్రము, మెచ్చుకొనుచు నుండెడువాఁడవుసుమా!

పరంజ్యోతి:—ఓహో! ఎత్తిపొడుచుచు, నేమో! నీకు మహావిశ్వాస మున్నట్లు, నన్ను హేళనము చేయుచుఁ, గందురీఁ గలపుట్టువంటిసంగతినిఁ గదిపి యున్నావు. కానిమ్ము! ఎఱుగుదు వుగదా! మనపూర్వికపులందఱియందును, నా కెంతయయినను గౌరవ మున్నది. వారందఱును, లక్ష్మీపుత్రసన్నులుగాకపోయి నను సరస్వతీపుత్రసన్నులే యని, చెప్పుట కిసుమంతయు, సందే హము లేదు. కాని, వారిమనస్సులు, అతిశయోక్తులకును, అత్యంతాతిశయోక్తులకును, జన్మస్థానము లని, నీవు నెఱుఁగు దువు. మనసుకవిత్వాచారయం దొకరికంటె నొక రధికులుగనే యున్నారు. కాని, వారు చెప్పుచువచ్చినవిషయములుమా త్రము, విశ్వాసార్హములుగాకుండునవిగనే యున్న వని, నీవు నొప్పుకొనక తప్పదు.

మఱియు, గోరంతలు గొండంతలుగాఁ జేసి, యత్యం తాద్భుతంబుగ వర్ణించుటయందును, దాము కలలో నయిన నెన్నడును జూచి యెఱుఁగనివిషయముల నయినను, జక్కఁగాఁ జూచి యున్నట్లే, మహాభయంకరముగనో, యత్యంతసంతోష కరముగనో, వలసినట్లు వర్ణించుటయందును, మనకవులు, లోక ములోని యేయితర భాషలయందలికవులను మించెడువార లనియే మనము చిన్నప్పటినుండియు నెఱిఁగినవిషయమేకదా!

మధురసఝరీ మాధురీధురీణ నిరుపమాన నిరర్గళ కవిత్వ ధారావిరాజితుం డగు బమ్మెరపోతనామాత్యుఁడు, లోకములో గల యంతభక్తియొక్క స్వరూపమే యని, నిస్సందేహముగాఁ జెప్పఁగలను. అమ్మహనీయుఁడు జీవించుచుండిన కాలమట్టిది. అమ్మహాత్ముని మనస్సట్టిది.

శ్రీమదాంధ్రభాగవత మహాగ్రంథరాజమును జదువు నప్పుడు, మనస్సానందపరవశ మగుచుండుట నిశ్చయము. నిర్వివాదాంశము. అందలి నిరుపమాన మృదుమధుర కవితానంద మహాసముద్రమున మునుఁగు చుండుటచే, మన స్సాయాకథా భాగములయందలి విషయములలోని సత్యములనుగుఱించి పరిశోధించుట కించుకయును లక్ష్యము చేయ నేరకయే యుండును సుమా!

మఱియు, మహారాజ్యరమాధురంధరు లయ్యు, స్వమతాభిమాను లయి, స్వభాషాభిమాను లయి, సుఖానంద జనకంబుగ, నిరంతరనిరంకుశప్రభుత్వములు సల్పు చుండిన సుప్రసిద్ధదేశాధిపతుల యాస్థానములు, స్వపాండిత్యప్రకర్షము వలననే, యాశ్రయములుగా సంపాదించి, సేవకు లయి, స్వచ్ఛందజీవనోపాయమును సంపాదింపఁ గలిగితి మని, పరమానందము నొందుచుఁ, దఱచుగా, శుభాశుభకార్యములయందు ధనకనకవస్తువాహనాంబర గ్రామాదులు, బహుమానములుగాఁ బొందుచు, నాగంతుకానేక కష్టాగౌరవంబుల నింతయు నెఱుంగ నేరక, నానావిధానేక లోకసుఖంబులం దేలుచుఁ,

గన్న గారిక, హాయిగా, కాలము గడుపుచుండి, తుట్టతుదకు,

సీ. కవిరాజు కంఠంబుఁ గౌఁగిలించెనుగదా!
పురవీధి నెదురెండ పొగడదండ;
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా!
నగరివాకిట నుండు నల్లగుండు;
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబుఁ
దగిలియుండెనుగదా! నిగళయుగము;
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత,
వియ్య మందెనుగదా! వెదురుగొడియ;
గీ. కృష్ణవేణమ్మ గొనిపోయె నింటిపసిఁడి;
బిలబిలాక్షులు దినిపోయెఁ, దిలలు, పెసలు;
బొడ్డుపల్లెను గొడ్డేరి మోస పోతి;
నెట్లు చెల్లింతుఁ టంకంబు లేడునూర్లు?
సీ, కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి;
రత్నాంబరంబు లేరాయఁ డిచ్చుఁ?
కైలాసగిరిఁబండె మైలారువిభుఁ డేఁగి;
దినవెచ్చ మేరాజు దీర్పఁ గలఁడు?
రంభఁగూడెఁ దెనుంగు రాయరాహుత్తుండు;
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు?
స్వర్గస్థుఁ డయ్యె, విస్సనమంత్రి, మఱి హేమ
పాత్రాన్న మెవ్వనిపంక్తిఁ గలదు?

గీ. భాస్కరుఁడు మున్నె, దేవునిపాలి కరిగెఁ;
గలియుగంబున నిక నుండఁ గష్టమనుచు,
దివిజకవివరుగుండియల్ దిగ్గు రనఁగ
నరుగు చున్నాఁడు! శ్రీనాథుఁ డమరపురికి.

అని యాలోచితమనస్కుఁ డయి, యత్యంత చింతాకరంబుగ, గుండెజల్లుమనునట్లుగాఁ దనకష్టములను వెల్లడించుకొనిన రసికశిఖామణియయిన యీమహాశ్రీనాథమహాకవి జీవితకాలమునుగూర్చియును, సంతతభగవద్భక్తిపరాయణుం డయి, పరమభక్తాగ్రేసరుం డని, యెల్లవారలచేతను గొనియాడఁబడు చుండి, స్వచ్ఛందజీవనేచ్ఛామనస్కుఁ డయి,

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి, పురంబులు, వాహనంబులున్,
సొమ్ములుఁ, గొన్ని పుచ్చుకొని, చొక్కి, శరీరము వాసి,
[కాలుచే,
సమ్మెటవ్రేటులం బడక, సమ్మతి, శ్రీహరి కిచ్చి, చెప్పె, నీ
బమ్మెరపోతరా జొకఁడు, భాగవతంబు, జగద్ధితంబుగన్.

ఉ. బాలరసాలసాల నవపల్లవకోమల కావ్యకన్యకం
గూళల కిచ్చి, యప్పడుపుఁ గూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికు లైన నేమి? గహనాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికు లైన నేమి నిజదారసుతోదరపోషణార్థమై.

ఉ. కాటుకకంటినీరు, చనుఁగట్టుపయిం బడ నేల యేడ్చెదో!
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల యో మదంబ యో!

హాటకగర్భురాణి! నిను నాఁకటికింగొనిపోయి యల్లక
ర్ణాటకిరాటకీచకుల కమ్మఁ, ద్రిశుద్ధిగ నమ్మ భారతీ!

అని, నిజస్వభావమును వెల్లడించుకొనిన యీపరమ పూజ్యుఁ డయినపోతనామాత్యుని జీవితకాలమునుగూర్చియును, గొంచె మాలోచించి, చూచునప్పుడునుమాత్రము, ఎట్టిమహా దారిద్ర్యకష్టముల ననుభవించు చున్నను, సేవకావృత్తి యను మాటయే లేనిసంతుష్టిగల పోతనామాత్యుని స్వచ్ఛందజీవనమే నిజముగా, సకలసుఖానందశాంతిసంధాయక మయినజీవన మని, తప్పక, తోఁచక మానదుగదా!

ఇంక, నీవిప్పు డుదాహరించిన, „కుచేలోపాఖ్యానము" „గజేంద్రమోక్షము" „ప్రహ్లాదచరిత్రము" „అంబరీషోపాఖ్యానము" అను నాలుగు పాఖ్యానములను గురించియు, నించుక చూచాయగ ముచ్చటింపవలసి యున్నది. కవిత్వ విషయ మటుండనిమ్ము. నిరుపమానకవిత్వ మని, యనేక శతవర్షములనుండీ, పరంపరగా, సర్వు లయినయనేకులచేఁ జెప్పఁ బడు చుండినమానసంగతినిఁ గూర్చి వేఱువిధంబుగఁ, జెప్పుటకు, మనము, నిశ్చయముగా, నసర్వులమే యగుదుము. మనమే యన నేల? ఈకాలమునందుఁ, బండితుల మనియుఁ, గవుల మనియుఁ, బండితకవుల మనియు, నహంభావముగలవారలలో, నొకఁడు, నేతద్విషయమునుగూర్చి, వేఱువిధంబుగఁ జెప్ప సర్వుఁడు గాఁ డనియే, నిస్సందేహముగాఁ జెప్పవచ్చును.

వేయేల? శ్రీమద్భాగవతమును, మరలఁ దేఁకించెద

నని చెప్పినట్టియుఁ, జెప్ప నున్నట్టియు, కవివరుఁ డెవ్వఁడయి నను, గలఁ డేమో! వేలు మడచి, యొక్కనిఁ జెప్పుము. సంత సించెదను. అట్టివా రెవ్వరును, నేటికిని, బుట్టియే యుండలే దనియు, నింకను బుట్టకయే యుందు రనియును, నేను ధైర్య ముతోఁ జెప్పఁగలను.

సహజపాండిత్యుఁడేయని ముమ్మాటికిఁ జెప్పవలసిన పోతనామాత్యుఁడు, గ్రంథారంభము మొదలుకొని, గ్రంథాం తమువఱకు నొక్కవిధముగాఁ బరమాద్భుతంబుగఁ, గవిత్వము చెప్పఁగలనిరుపమానసామర్థ్యము గలవాఁడుఁ సలలితసులభప్రా సములతోడను, అత్యంతమనోహరాంత్యనియమములతోడను, మిగులఁ గోమలములగు పదములతోడను, గవిత్వము చెప్పు టయం దిక్కవితో సమాను లెవ్వరును లేరు. విష్ణుభక్తిని దన నిరుప మానకవితాసామర్థ్యముచే నత్యంతమనోహరముగాఁ దాండవముచేయింపఁగల యత్యంతాద్భుత శక్తిగలవాఁడు. అందుకు "మందారమకరందమాధు" ర్యా పద్యరత్నములే, ప్రబ లనిదర్శనములుగా నున్నవి. శ్రీమదాంధ్రభాగవత మొక నిరు పమానకవితామృతసరోవరంబనియు, నందలిపద్యంబులెల్ల మనో హరత్తుంగ తరంగంబులనియుఁ జెప్పఁ జనునుగదా!

కాని, యిటీవలివారలు గొందఱు, అంత్యనియమము లయం దక్కవికులశేఖరు ననుకరింపవలయు నని, కొన్నికొన్ని పద్యములనుమాత్రము, తమతమగ్రంథరాజములయందు, రచి

యించుచువచ్చినను, రచియించియుండవచ్చును. కాని, యట్టి ప్రియత్నము లన్నియుఁ బులినిఁ జూచి, నక్క వాతలు పెట్టు కొనుటవంటిదియేకదా! ఎప్పటి కయినను బులి పులియేకదా! నక్క నక్కయేకదా!

ఇంకఁ, గవిత్వమునకుఁ గల ముఖ్య మయిన విషయము నకు రావలసి యున్నది. ముందుగాఁ "కుచేలోపాఖ్యాన" కథ నుగూర్చి కొంచె మాలోచింతము.

పతివ్రతాశిరోమణి యయినభార్యతోడను, మనశ్శాంతి కెంతయు భంగమును గలిగించుచు, నానావిధముల నిరంతరము బాధపెట్టుచు లెక్కకు మెక్కువగా నుండు బిడ్డలతోడను, ఇంతిం తని చెప్పరాని మహాదారిద్ర్యకష్టముల ననుభవించు చుండిన ధీవిశాలుఁడును, సంతుష్టాంతరంగుఁడు నయినకుచేలుఁడు, తన భార్యయొక్క బలవంతపుహితోపదేశముచే, శ్రీకృష్ణుని సందర్శిం చినప్పుడు, దయార్ద్రహృదయుఁడును, ఆర్తజనరక్షణదీక్షాధురం ధరుఁడును, నయిన యాశ్రీకృష్ణుఁడు, దన్ను సందర్శింప వచ్చిన జీవముగల చర్మవృతాస్థిపంజరమువలె నున్న యాదీనాననునిఁ గుచేలునిం జూచి, యెంతయు జాలిపడి, సర్వవిధముల గౌర వించి, బాల్యస్నేహము నించుకయును మఱచిపోక, యాబీద బ్రాహ్మణునకు సర్వవిధముల సాయ మొసంగి, వానిని సంపూ ర్ణసంతుష్టాంతరంగునిఁగా జేసి, పంపినందుకు, మన మెంతయు సంతసింప వలసియే యున్నది.

కాని, యెనమండ్రుగురుభార్యలను, బదునారువేలగోపిక లనుగలిగి, నవరత్నఖచితసుందర పర్యంకరమ్యహర్మ్య గృహారామాదులనుగలిగి, నానావిధసంసారసుఖదుఃఖము లనుభవించుచుండిన యాశ్రీకృష్ణుడు, దేవుఁడనియు, దేవునియొక్క యవతార మనియు, నెంతమాత్రి మొప్పుకొనుటకు, వీలులేదు సుమా! అన్యాయాగ్రహసంసక్తచిత్తుఁ డనియే యొక్కయెడ నత్యంతచింతాకరంబుగఁ దప్పక జెప్పవలసినది శ్రీకృష్ణుఁడు కేవలము మానవుఁడు. యాదవకులసంభూతుఁడు. ద్వారకాపురమును, మహాశక్తిసంపన్నుఁడై సర్వజనరంజకముగాఁ బరిపాలించినవాఁడు.

దేవుఁడు సకలసద్గుణస్వరూపుఁ డనియు, నిర్గుణుఁడనియు, ననుటయందసర్భ మున్నది, నిరాకారనిర్వికారనిరంజనస్వరూపుఁ డగునట్టి యాదేవునిగుణములు వేఱు, మానవునిగుణములు వేఱు. కాని యొకొక్కసత్పురుషునిగుణములు, దేవునిసద్గుణలేశము లలో, సహస్రాంశ మయినను బోలు చుండినఁ బోలు చుండవచ్చును.

శ్రీకృష్ణుఁడు, రాజ్యతంత్రపరిజ్ఞానసంపూర్ణుఁ డని, శ్రీభగవద్గీతాదిగ్రంథరాజములవలన మనము తెలిసికొను చున్నాము. కాని, యాతఁడు, నిజముగా నెంతజ్ఞానశక్తిసంపన్నుఁడో, యెట్టిమాయావియో యెవ్వరును, గన్నులారఁ జూచి యుండనివిషయ మగుటచే, నంతగాఁ దెలిసికొనుట కవకాశము లేకయేయున్నది. కాని, యాశ్రీకృష్ణునిగూర్చి వ్రాసినయా యనేక

మహాకవులు మాత్రము, అసాధారణశేముషీవిశేషు లనిమాత్రము చెప్పుట కిసుమంతయు సంశయము లేదు. మఱియు శతాబ్దములు గడచుచుండినఁ గాలఁదని మనోజ్ఞములను గ్రంథములను గామార్చుచు సహస్రాంశోత్కృష్టముగ వర్ణించుచుండుట మానవుల మనస్సుల పరిస్కృతిఁగూర్చు లోకములోఁ గదా!

తారక:—ఓహో! బాగుగఁ జెప్పుటకుఁ బ్రారంభించినావు. ఇంక, "గజేంద్రమోక్షము" ను గూర్చి యేమి చెప్పెదవో, వినవలయు నని, కోరిక పొడముచున్నది. కానిమ్ము. వినెదను.

పరంజ్యోతి:—ఏమి? పరిహాసము జేయుచుఁ, "గానిమ్ము. వినెద" నని చెప్పుచున్నావు. హృదయపూర్వకముగా నేను జెప్పువిషయములను, దిక్కుశంకరయ్యునలెఁ గాక, స్నేహభావముతో, శాంతముగా విని, యాలోచించి, నిశ్చయించుకొను మంచిస్వభావముగల బుద్ధిమంతుండ వని, నేను జెప్పుచున్నాను. "గజేంద్రమోక్షము"నుగూర్చి నాకుఁ దోఁచినది చెప్పుచున్నాను వినుము. నెమ్మదిగా నాలోచింపుము.

"గజేంద్రమోక్షము" ప్రకృతియందే, స్పష్టముగాఁ గానఁబడుచుండు నిర్దాక్షిణ్యస్వభావమును, జ్ఞప్తికిఁ దెచ్చుటయందుఁ, జక్కఁగాఁ బనికివచ్చునొకగొప్ప మంచియుదాహరణ మని చెప్పవచ్చును. జాగ్రతగా వినుము. పరమకరుణాసముద్రుఁ డని లోకములో నెల్లవారలచేతను, బహుసహస్ర వర్షముల నుండి హృదయపూర్వకముగా స్తోత్రములు చెల్లింపఁబడుచున్న

కర్తయు, శాపకారణాభాసము లని, నీవు చెప్పఁ బ్రయత్నించెదవు కాఁబోలు! అట్లు చెప్పునట్టి స్వభావముగల బుద్ధిమంతుఁడవు కావనియే నానమ్మకము.

మఱియు,

మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ, జక్క నొత్తఁడు, వివాదప్రోద్ధతశ్రీకుచో
పరిచేలాంచల మైన, వీడఁడు, గజప్రాణావనోత్సాహియై.

అని, పోతరాజుగారు, తాము వ్రాసినపద్యమును జదువఁగా, విని, దోషాన్వేషణోత్సాహ మానసుఁ డగుచు నా శ్రీనాథమహాకవి, యది సమ్మతముగా లేదనఁగా, నొకయసత్యమును బలికె, నొకమాయోపాయమును బన్ని, తన బావమఱది యగు శ్రీనాథమహాకవి చెప్పించిరి, పోతరాజుగారే, యిప్పుడు సజీవులయి, యుండినయెడల, నమస్కరించెదను, సాష్టాంగ నమస్కారము నొనరించి, వ్రాసినయపరాధమున కేమిసమాధాన మొసంగెద రని యడిగిన, నేమి చెప్పఁగలుగుదురో! ఏమి చెప్పగలుగుదురు? ఇప్పు డాయన లేరుగదా! కాని, దేశమునందా యన పక్షము నవలంబించెడు నభిమానవంతులగు పండితోత్తములును, కవీశ్వరులును, ఏమిచెప్పెదరో! ఇప్పుడు, వారిసంగతి యేల? అందఱిపక్షమునను, నీవే, యిప్పుడు, నాయెదుట నున్నావు గాన, నీ వేమి చెప్పెదవో చెప్పుము. విని సంతోషించెదను.

# జ్ఞానభాస్కరము

## పదవప్రకరణము.

---

తారక:—ఓహో! నీవు చెప్పనట్టివిషయము లన్నియు, విన్నప్పటినుండియు, నాకు గొప్పగొప్పసంశయముల నడిగి, తెలిసికొనవలయు నని, యాలోచనలు గలుగు చున్నవి. నీ వంతకంతకుఁ బురాణగాథల నెల్లను, నితరాలోచనలలో ముంచిముంచి చెప్ప నారంభించు చున్నావు. ఏదీ చూతము. ప్రహ్లాదచరిత్రమునుగూర్చి యేమి చెప్పెదవు?

పరంజ్యోతి:—చెప్పెదను వినుము. నేను చెప్పనట్టివిషయముల నెల్లఁ, బూర్వికపుల పుంపుఁగాని, పురాణములయందుగాని, యభిమానమునుమాత్రము కలిగి యుండక, సత్యమునే గ్రహింపవలయు ననెడు ప్రధానముతో, శాంతముగా, విను చున్నందుకు, నా కెంతయు సంతోషముగా నున్నది.

"ప్రహ్లాదచరిత్రము" శైవవైష్ణవులకు జరిగినమహాఘోరమయినపోరాటమని, ముందుగాఁ జెప్పవలసి యున్నది సుమా!

ప్రహ్లాదుఁడు, రాక్షసవంశసంభూతుఁ డయినహిరణ్యకశిపుకుమారుఁడు. కావున, నాతఁడును రాక్షసుఁడేకదా! రాక్షసులు క్రూరస్వభావులు. నిష్కారణముగా, సజ్జనహింసయే, విశేషముగాఁ జేయునట్టిప్రకృతి గలవారు. జపతపహోమాదులకు, నాశనము గలిగించుటయం దత్యంతోత్సాహము

గలవారు. మునులతో పాయుధములనుగాని, దివ్యజ్ఞానములను గాని లేశమయినను జంకని పరమదుర్జనులు.

కాని, రాక్షసవంశమునందు జన్మించినవాఁ డయినను, ప్రహ్లాదుఁడుమాత్రము మత్సరదుర్గుణము లేవియుఁ గలిగియుండని వాఁడు. మిక్కిలి మంచిహృదయము గలవాఁడు. పరమ విష్ణుభక్తుఁడు.

సర్వసాధారణముగా, రాక్షసవంశసంభూతులు లయిన వారల కందఱకును, మహేశ్వరుఁడే పరమదైవము. ఆకారణము చేత, హిరణ్యకశిపుఁడు, తనకుమారునిఁ బ్రహ్లాదుని, విష్ణుభక్తి పరాయణునిఁగాఁ జేయ నొల్లక, మహేశ్వరభక్తిపరాయణు నిఁగాఁ జేయుటకయి, యెన్నియో మహోగ్రవిధంబుల నాతని విడువక బాధింపసాగెను. కుమారుఁడో, తండ్రి యాజ్ఞల నెల్ల నుల్లంఘించుచు శ్రీమహావిష్ణువునే, దృఢముగా, నెమ్మ నమ్మున నమ్మి, యాదైవమునే నిరంతరము ధ్యానింప సాగెను.

ఈప్రకారముగాఁ దండ్రియును, కుమారుఁడును, మహే శ్వరుఁడని యొకఁడును, విష్ణువని యొకఁడును, నిరంతరవైరభావ ములతోఁ బోరాడు చుండుటఁజూచి, విష్ణువు నృసింహావతార మెత్తి, హిరణ్యకశిపుని సంహరించి, నిజభక్తుఁ డగుప్రహ్లాదుని సంరక్షించె నని చెప్పఁబడి యున్నది.

శ్రీమహావిష్ణువు, హిరణ్యకశిపుని సంహరించినది, భక్తి విషయమునా? క్రూరస్వభావనివారణమునా? యను రెండంశ ములు, యోచింపవలసి యున్నది. భక్తివిషయమునే యని

చెప్పినదోఁ, దా నెట్టిదైనమో, యామహేశ్వరుఁడు నట్టిదైవ మేకదా! హిరణ్యకశిపుని, శివభక్తుఁ డనుకారణముచేతనే, సంహరించినదో, నిజముగా, శ్రీమహావిష్ణు వీదృగ్గుణసంపన్నుఁ డని చెప్పవలసి యుండునుగదా!

అట్లుకానిచో, వాని క్రూరస్వభావమున కనియేకదా చెప్పవలసియున్నది! హిరణ్యకశిపునకు, రాక్షసజన్మకారణంబునఁ, గ్రూరస్వభావము ప్రకృతిసిద్ధముగా నుండియున్నది. మఱియు, నయ్యది, బ్రహ్మదేవుఁ డొసంగినవరముల దుష్ప్రభావముచేత నుద్రేకించి యున్న దని చెప్పవలసి యున్నది.

గీ. చేతులారంగ, శివునిఁ, బూజింపఁడేని,
నోరు, నొవ్వంగ, హరికీర్తి, నుడువఁడేని,
దయయు, సత్యంబు, లోనుగాఁ, దలఁపఁడేని,
గలుగనేటికిఁ ? దల్లుల కడుపుచేటు.

అనివ్రాసినపోతరాజుగారు, శివకేశవుల కంతగా భేదమును, గల్పింపకయున్నను, మొత్తముమీఁద, విష్ణుభక్తియే సర్వోత్కృష్టమయినదని మనోహరాలంకారములతో విష్ణుభక్తి మూర్తీభవించినట్లుగాఁ గవిత్వమును గంభీరధోరణిం బ్రవహింపఁజేసి,

గీ. చక్రిచింతలేని, జన్మంబు జన్మమే?
తరళసలిల బుద్బుదంబుగాక,
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుఁడే?
పాదయుగముతోడి పశువుగాక.,,

అనిబ్రాసినందుల కత్యంతాశ్చర్యము నొందవలసియు న్నది. కాని, యాకాలమునందు శివభక్తపరాయణు లయిన యుత్తమకవులత్యంత కుపితులయి, యనుమలకేమేమి పల్కి యుండిరో, యేమేమిబ్రాసియుండిరో, మనమిప్పుడూహించు టకు లేశమయినను శక్తులముగాక యున్నాముకదా!

కావుబట్టి, యాగర్వంబు నారయ నేరక, వరము లొసం గిన యాబ్రహ్మదేవునికార్యమునకు, హిరణ్యకశిపుని శిక్షిం చుట, న్యాయాన్యాయ విచారణకర్త యగునాదేవునకా శ్రీ మహావిష్ణువునకు, ధర్మము గాదుగదా!

బ్రహ్మదేవుని వరప్రభావమువలననేమి, హిరణ్యకశిపుని నిరంతరహింసాచరణ స్వభావమువలననేమి, శ్రీమహావిష్ణువు, పాపము, సగముకంటె నెక్కువగ మానవుడుగను, శిరస్సు మాత్రము చతుష్పాదజంతువుగను, సహింపవలసినబాధ్యత బొందవలసిన వాడయ్యెనుగదా! ఆహా! ఎంతయాశ్చర్యకర మయినవిషయము ఎంతచింతాకర మయినయంశము.

ఈప్రహ్లాదచరిత్రము గూర్చి యింకొక్కముఖ్యాంశ మును జెప్ప మఱచితిని. ఇప్పుడది, జ్ఞప్తికి వచ్చుచున్నది. ఇది నిజముగా నాశ్రీమహావిష్ణువునకును, ఆమహేశ్వరునకును, ఘోరయుద్ధమును గలుగ జేయవలసినదిగా గానబడు చున్నది.

పాలాక్షుం డయినయామహేశ్వరుడు, దనకు బరమ భక్తుం డయిన యాహిరణ్యకశిపుని శ్రీమహావిష్ణువు సంహారించి

నప్పు డేలపరిశ్యక్తుమయి సంరక్షింపక మూకీభావము నవహించి, యూరకుండెనో, నే నూహింపఁజాల కున్నాను. తనమూఁడవ కన్ను తెఱచి; కామదేవుని భస్మముచేసినట్లే, యాశ్రీమహా విష్ణువునిసహితము భస్మముగాఁ జేయలే కుండెనో! దూర్వా సుని వెంటాడించి నట్లే, తన్నుఁగూడ వెంటాడించి, సుదర్శన చక్రము పదునాలుగులోకములయందును, ద్రిప్పిత్రిప్పిఁ పరుగు లెత్తించు నని భయముఁ జెందిఁ కన్నులారఁ జూచియుండినవాఁ డగుటచే, నీశ్వరుఁ డూరకుండెను గాఁబోలు! లేదా, తనపెండ్లి ముచ్చటలలో నయిన నుండి యుండవచ్చును. లేదా, లయ కాలస్వరూపుఁ డయి, సద్గుణసంపన్నుఁ డను, శాంతాత్ముఁ డను నయిన యాదక్షుని యజ్ఞమును ధ్వంసముచేయుచు నయిన నుండి యుండవచ్చును.

మానవుఁడు, దేవుఁ డయిన యామహేశ్వరుఁ డునసహి తము, ముందుగాఁ, దనసుఖమును, దనకష్టము నాలోచించు కొనుచు నుండి యున్నాఁడే కాని, నిరాధారుఁడయి, నిజభక్తుఁడు పొందుపరుపఁ చేతిమరణమును, దప్పింప లే కుండెనుసుమా!

ఇట్టి చిత్రాతిచిత్రములయిన కథ లన్నియు, వరవ క్షోడను, శాపములతోడను, శాపవిమోచనముల తో బరమాద్భుత జన్మలతోడను, బ్రత్యక్షములతోడన వాణిపలుకులతోడను, నవిశ్వాసపాత్రము లం తోడను, నీతిబాహ్యము లయిన విషయముల హాస్యాశ్చర్యాస్పదంబుగ నుండి యుండె

యందుఁ గథితము లయి యున్నవిసుమా!

ఇట్లు చెప్పుటచే; మహాపురాణములు, శ్రీవణాన్వర్థ్మాము లయిన వనియుఁ, బరనాస్తిక్యము లయిన వనియును, జెప్పవల యునని, కేవలమాత్రమును, నాయుద్దేశముగాదు. మనముచదివి, యానందించి, యవలంబింపవలసిన సద్విషయములుసహిత మనేకములు, మహాపురాణములయందుఁ గల వనియు, నాసంపూర్ణవిశ్వాస మయి యున్నది.

తాంత్రిక:—బాగుగా నున్నది. నీవుచెప్పినట్టి విషయములను, నేను వినినకొలఁదిని, నామనస్సుల్లకల్లోలముగా నయిపోవుచున్నదిసుమా! అవి, స్వమతాభిమానమును, స్వభాషాభిమానమును, గలపండితులును, గవులును, గ్రంథకర్తలును, వినినవారలు, వారందఱు కొన్ని పొరపాటుగ న్వడమెత్తక మానరు. విపరీతాభిప్రాయముల నిచ్చుటేని, ముక్కలుముక్కలుగా ఖండించి, యాకాశమున కెగురఁగొట్టక మానరు. ఇంక, „అంబరీషోపాఖ్యానము"ను గూర్చి, యేమిచెప్పెదవో, యదిగూడఁ జెప్పుము. ముచ్చటగా వినెదను. తాను జెప్పఁదలచిన విషయమగుటంచి, యానందగ్గత వేలాగున లాలోచించు చున్నాతని మొగమువంక గొంచెము చూచుచు.

శ్రో:—ఏమీ! స్వమతాభిమానమనియు, స్వభానముఁ జెప్పుచున్నావు! నిజముగా, నవేవియో, నున్నావు. వినునట్టియుఁ, జదువునట్టియు, యుక్తములను విచారింపక, తలయూ

చుచు, విశ్వసించి, యథాప్రకారముగా, నడచుకొను చుండుపట్టి వాఁడు, నిజమయిన స్వమతాభిమానిగాని, స్వభాషాభిమాని గాని, కాఁడనియే చెప్పవలసి యుండును.

ఏమతమునం దయిన, నేభాషయం దయిన నుండెడి విషయములనంతరాత్మబోధవలనప్రకారముగాఁ, జక్కఁగావిమర్శించుచు మంచి యంశమును గ్రహించుచుఁ, జెడ్డను శీఘ్రముగా విడిచిపెట్టుచు నుండవలయునుసుమా!

ఇంక, "అంబరీషోపాఖ్యానము"ను గూర్చి, సూక్ష్మముగాఁ జెప్పెదను. వినుము. ఇది, యేకాదశీమహాత్మ్యము యొక్క చిత్రకథయే. మనుష్యుని యత్యంతాద్భుత బుద్ధినైపుణ్యమును, మనోల్లాసకరముగ నెల్లడించునానావిషయప్రవర్తనాద్భుతయంత్ర మగుబయస్కోపు ప్రదర్శనమునం దంబరీషుని చరిత్రమును నీవు చూచియే యుండవచ్చును. అయ్యది చూచునప్పుడు, మనస్సెంత విచిత్రవిచిత్రాలింగన మహానందములలోనయినను, మునుఁగు చుండి యుండవచ్చును. కాని, చూపఁబడు చుండెడునది యంతయు, మనస్సు సంపూర్ణముగా విశ్వసింపకయే యుండునుగదా!

కాని, యీయంబరీషుని చరిత్రమువలన, ముఖ్యముగాఁ, బూజింప నర్హులగువారలనందఱుగౌరవించి, పూజింపవలయుననియుఁ, గారణములేకయే, సజ్జనులను హింసించువారలు దామే హింసలపాలగుదురనియు, నస్వభావసంపన్నులు, దమకుహింసచేసినవారలకే, శ్రేయస్కరులగుటకే, యెల్లప్పుడును,

జూచుచుండు రనియును సనుమూనువిషయములను, మనము చక్కఁగా గ్రహింపవలసి యున్నది.

అదిగో! ఆరోగ్యరావుగారు బెల్ కొట్టినారు.

తారక:—అయ్యా! ఆరోగ్యరావుగారూ! క్షమించండి. కానియ్యండి.

ఆరోగ్య:—మిత్రులారా! మీరును, సభలలో జరగు నాచారములప్రకారముగాఁ, బరస్పరసంభాషణములలోను, గుసగుసలలోను, డిస్కషన్‌లోను, దిగుచుండుటచేతఁ, గొత్త క్రొత్తసంగతు లాలోచించుటకు, నాకుఁ, జక్కఁగా, నవకాశము గలిగించినందులకు, మిక్కిలి సంతోషించుచున్నాను. నేను జెప్ప దలఁచినయారోగ్యవిషయ మొంతవిపుల మయిన విషయ మయిన నగును. దయచేసి, నెమ్మదిగా విని, యాలోచించి చూచినయెడల, నేను చెప్పుచున్న విన్నియును, నారోగ్యమునకుఁ, జక్కఁగా, సంధించుచుండువిషయములే యని, మీకు నిశ్చయముగాఁ దోచఁక మానదని నాగట్టినమ్మకము.

తే. గీ. చేతఁగాకుండు కర్మకార్యముల్ చేయఁ జనదు;
భ్రష్టముల కెనుమంద్రోయు, వెఱవఁ జనదు;
జనుల్ బొగడంగ, మాంది నింత చనదు పొంగఁ;
జలము పూని, సత్కార్యమ్ముల్, సలుపఁ జనును.

గీ. ఆత్మదోషమ్ములఁ జక్కఁగాఁ గనరయఁ జనును;
పరమతంబుల, శ్లాఘనంబు, వలదను చూప;

సేవగించుచుఁ, బాపంబు, నెల్లమొదలఁ;
బాపి, నెయ్యెడ, దయఁ గనవలయుఁ జుండీ!
గీ. ఎగ్గుఁ జేసినవానికై, లగ్గు నిముఁడు;
కోపమును గెలువవలయును, గూర్మిచేతఁ;
గనఁగఁ జేయుఁడు, తనివినిఁ, గరుణచేత;
సత్యమున, నసత్యంబుపై, జయముఁ గనుఁడు.
గీ. పరధనాముల కాశింప వలదు సుండీ!
కరుణ నెత్తఱిఁ, జూపంగఁ, గడఁగఁ జనును;
మాయమాటలవంచించి, మనఁగఁ జనదు;
జ్ఞాన మజ్ఞుల కిపు చుండీ, కనుఁడు సుఖము.
గీ. అగ్నిశేషంబు నార్పంగ నగును మేలు;
ఋణము శేషంబుఁ దీర్పంగ గుణమె సుండీ!
శత్రుశేషంబు నుంచంగఁ జనదు సుండీ!
చెంద సుఖమెంతొ! మనుజుండు [illegible]యు నిటులు.
గీ. ఋణము, వ్యధ నిడ, నను నుగు, పరిణముతోడ;
శాంతి నమయించు; సుఖమును జంపుఁ జుండీ!
గౌరవంబును బోఁగొట్టుఁ, గాన, ఋణముఁ,
జేయవల దెప్పు, జ్ఞానంబుఁ జెందు చుండీ.
గీ. నక్క-జిత్తులఁ బన్నుచు, నరులధనము,
నపహరింపగవలె నంచు, నాత్మఁ దలఁచి,
తిరుగు చుండురు, వంచకుల్, దేశమందు;
నమ్మఁ జనదట్టివారలఁ; నమ్మ నమ్మ.

గీ. ధనమె ముఖ్యంబు, జనులకు, ధరణియందు;
ధర్మవిధముల, నది గూర్పఁ, దలఁపవలయుఁ,
గూర్చుకొను చుండుధనమును, గొంచ మైనఁ,
బాడుచేయంగ వల దెప్డుఁ, గీడు మూఁడు.

గీ. ధర సకలసుఖములకుఁ, గురువె సుండి!
గురువు బోధించునవి యెల్లఁ, గరము శ్రద్ధ,
వేఱుచింతలు గలుగక, వినుచు నున్న,
దిగులు లే కుండు, నారోగ్య మగును జుండి!

త్రిశ్వాము:—ఆహా! నీసుభాషితములు, నావంటివాని మనస్సునకే, చాల నచ్చుచున్నవి. ఎవరు చెప్పిననుసరే, నామనస్సునకుఁ గొంచె మయినను, నచ్చనే నచ్చవుసుమా! ఇది నాకుఁ జిన్నతనమునుండియు, నాతోఁ గూడవచ్చుచున్నవిచిత్రమయిన స్వభావమే.

కాని, గురువని, చెప్పినావు. గురు వనినతోడనే, నాకాలిమంట, నరాన తల కెక్కుచున్నది. గురు వనఁగా, నీయుద్దేశ మేమి? పాఠశాలలయందలిగురు వనియేనా? లేక మఱేదైనా? ఏమి? చెప్పుము.

ఆరోగ్య:—ఔను. పాఠశాలలయందలిగురు వనియే.

త్రిశ్వాసు:—గురు వనఁగా, మతగురు వని కూడ నున్నదిగదా! లోకములో నెన్నెన్నివిషయములలో నైనను, మంచిమంచిమార్పు లెన్నెన్నియో! కలుగుచున్నవి; కాని, కొన్నికొన్నిమతములలోఁ, గొన్నికొన్నివిషయములలో, మంచి

మంచిమార్గంబు గలుగకుండ, లోకాంతమువఱకు, నట్లే యుండు నట్లుగా, గనంబడు చున్నందుకుమాత్రము, నాకుఁ, జాల విచారముగా నున్నది. ఉదరపోషణోపాయములలోఁ బ్రధానమయినది యయినమతమునందు నష్టమును గష్టమును గలిగించు మార్గంబు సుఖకరముగాఁ గలిగించుట, యెంతయుఁ గష్టమేగదా!

మనతాతముత్తాతల కాలమునుండియు, నెంద ఱెందఱు రిఫార్మరులు పుట్టినారురా? ఎంద ఱెందఱు రిఫార్మరులు గిట్టినారురా? సంస్కారులు మని, విజ్ఞానీఁగువారల బోధ లన్నియు, దేశములో, నిమువక, చిరకాలమునుండి, చిత్రముగను, జంతాకరముగను వలవిరియఁబోసికొని, యెుకలు దెలియక దాండవము చేయు చున్నపూర్వాచారమహాపిశాచము నెదుట, భయంకరమయినపెద్దతుపానుగాలికి, జిర్పనసోకిపోవు దూదిపింజెలవలెనయిపోవు చున్నవిసుమా!

ఆహాహా! ఈలోకములో నెల్ల, నెన్నినందలమతము లున్నవిగదా! ఎంతచిత్రము! మతములసంఖ్య వినినతోడనే, గుండె జల్లుమను చున్నది. మన యీ యొక్క హిందుదేశమునందు మాత్రమే, నూఱుమతము లున్నవట! మత మనఁగా నొక్కదేవుఁడు, నొక్కవిధమయిన .ధర్మమేకదా! యుండవలయును. విన్నావుగదా! సీమదేశమునందు, సుప్రసిద్ధుఁడును, బుద్ధిమంతుఁడు నయిన యొకమహావక్త, ధ్యానము సోమరితన మని, యొకమతమువారు చెప్పెద రని సత్యమును జెప్పియున్నాఁడుసుమా! ధ్యానమే భక్తికిని, ముక్తికిని, మూలాధార

మని నిశ్చయముగా నమ్ము చుండిన మహామునీంద్రు లనేకులు నివసించు చుండిన యీభరతఖండముం దట్టియుద్దేశ మెంతయు నాశ్చర్యమును, సంతాపమును, గలిగింపక మానదుగదా!

మనదేశములో, ద్వైతాద్వైతవిశిష్టాద్వైతమతము లని, మూడుమతములు, సుప్రసిద్ధములు. ఈమతములలో, నొకమత మువారు, పుణ్యసంపాదనమునకై, బోధించు నతివిచిత్రమయిన ధనాకర్షణజ్ఞానమార్గమును, జాగ్రతగా వినుము.

నిజముగాఁ జేయులాభకర మయినబోధ, శూన్య మయి నదియే యయినను, ననహ్యాకర మయినదియే యయినను, గురువులు దామీ భూలోకములో, దేవునితరువాత దేవుని యంతవార మనియుఁ, దమపాదములు గడిగి, యామహాపవిత్ర జలము, కొంచెము నెత్తిమీఁదఁ జల్లుకొని, మిగిలినది నోటిలో బోసికొని, నారాయణనామస్మరణను చేసికొనుచు, వెనుక ముందులుచూడక, కన్నులు మూసికొని, గుటుక్కున మ్రింగివేసినయెడల నానిమిషము మొదలుకొని, యెంతయినను బుణ్యము గలుగు నని, బోధించెదరట! ఇది, మనదేశమునందుఁ జిరకాలమునుండి వచ్చుచున్నమహాపవిత్రమయిన యాచార మేసుమా! ఆహా! యెంతమాయ! అంతటితో సరిపోయినఁ, గొంతవఱకు, బాగుగనే యుండును. తమపాదములకుఁ దడి జేగురుమన్ను రాయించుకొని, యొకచిన్న తెల్లగుడ్డమీఁదఁ దొక్కి, యొకరూపాయ మొదలుకొని, నూఱో, లేక, యంత కంటె నెక్కువగనో, వారివారిస్థితిగతులనుఁబట్టి, ధనము స్వీక

రించి, “మా పాదచిహ్నములు గంయాడి దగ్గఱ, భద్రముగా, దేవతార్చనపెట్టెలోఁ బెట్టుకొని, దినదిన మాగుడ్డమీఁదిపాదములకుఁ, బూజ చేయుచు, ధూపదీపనైవేద్యాదులు సమర్పించుచుఁ, బాదతీర్థమును బ్రింగుచుఁ, బూజచేసినపువ్వులు, చెవులలోను, జుట్టులోను, బెట్టుకొనుచుండుఁడు. మీ కెంతైనను బుణ్యముగలుగును.” అని శిష్యుల కాజ్ఞనొసంగి, వెళ్ళిపోయెదరట! ఆహా! మోసమునం దింతకంటెఁ జిత్రమయిన మోసము మఱియేది యున్నది.

పాపము! అమాయకు లగుటయా శిష్యు లట్టిసద్బోధలను, ఈశ్వరోక్తము లయినవేదవాక్యములుగా భావించి, యాలాగుననే చేయుచుఁ, దరించుచున్నామనియుఁ, బితృదేవతలను దరింపఁజేయుచున్నామనియు, ననుకొనుచుండెదరట! ఆహా! ఇంతకంటె నాశ్చర్యకర మయినదియు, జింతాకర మయినదియు, ననారోగ్యకర మయినదియు నేదేది యున్నది. బాగుగా నాలోచించి, చెప్పుము.

ఆరోగ్య:—ఇప్పుడు నే నేమి చెప్పఁగలను? జనాభిప్రాయ పరిణామములలోఁ బడి, యుక్తాయుక్తరీతిగా, నావశక్యముగా నుండునట్లుగాఁ, గొట్టుకొనిపోవుచుండు లోకములోని వివిధమతముల నెల్ల, నించుక జ్ఞానదృష్టితో, నీవే చక్కఁగా నాలోచించి, నిశ్చయించుకొనుము. నీవు వివరించి చెప్పిన గురుపాదచిహ్న విచిత్రకథకంటె నత్యంతచిత్ర మయిన కథ నేనొక్కటి చెప్పెదను. అందులకు నీ వేమి చెప్పెదవో

లోకములో, నీతిని స్థాపించి, యయ్యది, దినదినాభివృద్ధిం బొందునట్లుగాఁ జేయునది, పరమపవిత్రాచార మయిన వివాహబంధమేకదా! అట్టివివాహాది కార్యములకు, నెంతయో కొంత ధన మత్యంతావశ్యక మయిన దని, వేఱుగఁ జెప్ప నక్కఱయే లేదు.

మనవారలలో ననేకులు పెద్దమనుష్యులు, లోకులయనుభవములను గాంచుచుఁ, గ్రమక్రమముగాఁ, గన్నుదెఱచుచు, నట్టికార్యములలో, విశేషముగా ధనమును వ్యయముచేయక, సుఖముగాఁ దేలఁ బ్రయత్నించుచునే యున్నారు. కాని, కొందఱు ధనవంతులు, తమ గొప్పతనము జూపుకొనుటకో, ధనములేనివారు, పరులకడ నప్పుగాఁ దెచ్చికొని తమ గొప్పకొరకో, డంబమున కట్టి కార్యములలో, విశేషముగా ధనమును వెచ్చపెట్టి, యప్పులపాలయి, చెప్పుటకు శక్యముగాని నానావిధములయిన బాధల ననుభవించుచుండుటయు, నిప్పుడు చక్కఁగా నెఱిఁగిన విషయమేకదా!

లోకములో, మనుష్యులు పత్రికాముఖముగా, నానావిధముల బాధలఁ బడుచుండుట, నిరంతరము, చూచుచుండువాఁడయునను, దేవుఁడు దన వివాహమునకు, లెక్కలేనన్ని కోట్లు ఎక్కడనుండియో! కుబేరుని యొద్దనుండికదా, బోలు! ఋణము దీసికొనివచ్చి, మహావైభవముతోఁ, దనపెండ్లి చేసికొని, హాయిగా, లోకములను గాపాడుచున్నాఁడట!

కాని, ఋణదాతలు, దామిచ్చినసొమ్ము వడ్డీవ్యవహారములయు

నని, యడుగ నారంభించఁగా, నియ్యకొనుటచే, పాపము! దేవునకుఁ దేవుఁడగుటచే, నవరత్నములు చెక్కిన బంగారపుసంకెళ్ళు, ప్రతిసంవత్సరము, వేయుదురట; అయ్యో! ఎంత జాలికర మయినసంగతి! ఎంతయువిస్మయపాత్ర మయిన యాశ్చర్యకర మయినవిషయము. సంక్షే మయినన్యాయ గాక, మఱి యే దని చెప్పవచ్చును?

పిమ్మటఁ, బరమభక్తినిష్ఠపరు లయినధనవంతులును, బీదలును, దైవమునకు సంపాదించినద్రవ్యమును, సగౌరవమునకును, మిగుల జాలిపడి, మోక్షసాయుజ్యముల నపేక్షించి, దేవుని ఋణవిముక్తునిగాఁ జేయుటకై, పదులో, వందలో, వేలో, తప్పక ప్రతిసంవత్సరమిచ్చి, యేయేటి కాయేడా బంగారపుసంకెళ్ళు తీసివేయుచుండి, కొంతవఱకు, సంతుష్టిని బొందుచుండెదరట!

దేవునిగొప్పఋణమును, భక్తప్రియకారణముగా, అనేకసంవత్సరములనుండి, తీర్చివేయుచున్నను, ఋణము దేవుని జీవితకాల మంతయు తీర్పలే నన్నికోట్లగుటచేఁ గాఁబోలు, నేటికిని వడ్డిలో గొఱగవంతైనను తీఱకయే యుండియుండ వచ్చునుసుమా!



# జ్ఞానసంస్కారము.

ఎనిమిదవ ప్రకరణము.

౮—

ఈలోకములో, వెలుగుచీకటులవలెనే, జ్ఞానాజ్ఞానములు రెండును, గూడఁగూడ, లోకమున్నంతవఱకును నడకలు నడచు చుండు నని మనము తెలిసికొనవలసియున్నది. క్రమక్రమముగాఁ, గాలమే, 'జ్ఞానసంపన్నుల' ద్వారా తెగనిప్రయత్నములచే, నజ్ఞానాంధకారమును నశింపఁజేసి. జ్ఞానమును బ్రకాశింప జేయు చుండునుగదా! ముఖ్యాంశ మయిన యారోగ్యమును విడువఁగూడదు. ఇంకను, గొన్ని మంచిసంగతులు చెప్పు చున్నాను. అవి యన్నియు, నారోగ్యమునకు మూలకారణములని యే చెప్పవచ్చును.

గీ. దేశ మిది నాది, యనుచు, నుద్రేక పడక,
లోక మంతయు, నొకటిగ, లోనఁ దెలిసి,
యెల్లవారల, సమదృష్టి, నెల్లపుడును
గనుచు, సుఖముండ, సుఖమును, గాంచ నగును.

గీ. భక్తితన్మైక్య, వెలయు, సేవనుభఁ గన నగుఁ;
శాంతిసుఖములు గలుగంగ, సంతసమునఁ;
రాజ్యమేలుచుఁ, గాపాడురాజునకును,
భక్తి గల్గిన, సుఖ మగుభాగ్య మబ్బు.

గీ. ధర్మసత్యముల్ శాంతి సౌఖ్యాకరములగుట,
న్యాయమార్గంబు, నుదయించుఁ, బాయకుండ,
జనులు పొగడంగఁ, బ్రథితిని, జగతిఁ గనుచు,
రాజ్య మేలంగవలయును, రాజు, కరుణ.

గీ. మతము, పేరుమయే, యనునది, మఱచి, వలచుచు
నేను బ్రాహ్మణుండ ననుచు, నేను శూద్రుఁ
డ ననుచు, వెతలునీర్ష్యలఁ, గంత యుండి,
భరతఖండంబు, యశమునె, పడయుఁగాక!

అదిగో! మనము, సభ ముగింపఁజేయఁబోవు చుండు సమయమునకే మిరిటీకవి మిఠాయిరావును, కోకిలరావును, భరద్వాజపురుడు, ఎక్కడికో వెళ్ళి, వచ్చుచున్నారు. ఓరీ! జ్ఞాపకమునకు వచ్చినది. మనతో జమప్రకాయు చుండెడినరాధా మాధవుఁ డేమయినాఁడురా? చాలకాలమునుంచి కనఁబడు టయే లేదు. కారణము తెలియదు.

ఆహా! మనముఖ్యప్రాణరావు చేసినచిత్రము విన్నావు గదా! వాఁడీమధ్య వేసవికాలపునెలలలో, నొకరాత్రి, తమ యింటిలోనిది, రెండువందలరూపాయలవిలువచేయుకంఠెయొకటి మంచముక్రింద నున్నపెట్టెలోనుంచి, మారుతాళముతోఁ దీసి, నెమ్మదిగా, ద్రాక్షారామభీమేశ్వరరావుగాడి యింటికి వెళ్ళి వానిని లేపి, యిద్దఱును గలిసివెళ్ళి, యావస్తువు నూటయేఁబది రూపాయలకమ్మివేసి, యారాత్రియే బయలుదేరివెళ్ళి చెన్న పట్టణమునందు దొరకపెద్దసత్రములోఁ బ్రవేశించినారట! తరువాత,

వారును దల్లిదండ్రుల కొక్కఁడేకొడుకు గగుటచేతను, అందులోఁ బెంపుడుకుమారుఁ డగుటచేతను, అందఱును జాలవిచారింప సాగిరి. చుట్టుపక్కల గ్రామములలో నున్న తమబంధువులంద ఱియిండ్లకు వెళ్ళి, యొక్కఁడును గానఁబడకుండుటచేతను, జనిపో యియుండవచ్చునని, కర్మచేయుటకుఁగావలసిన వస్తువులన్నియుఁ గొని, యంతయు సిద్ధముచేసినారట! కర్మచేయించుబ్రాహ్మ ణునిఁగూడ నొకసమీపగ్రామమునుండి పిలిపినారట! చాల గ్రామములలో నున్నబంధువులందఱును వచ్చి యుండుటచేత నింటినిండ ననేక వెండివస్తువులుండుటచేత "యింటిదొంగ నీశ్వ రుఁడయినను బట్టలేఁ" డను సామెత చక్కఁగా సార్థకముగాఁ జేయఁబడుచు, నిల్లంతయుఁ గిటగిట లాడుచున్నదట! కొందఱు పిల్ల నియ్యవలెనని యడుగుకొనుచున్నా మని విచారింపసాగి రట! కొందఱు మనతమపిల్లవాండ్రను బెంపున కియ్యవచ్చి, లోపలలోపల నాస్తులు మొదలగున వానిని గూర్చి బాగుగాఁ దెలిసికొనఁ బ్రారంభించినారట! ఇంటఁ బ్రతిరోజునను, బది పదునైదు కుంచములబియ్యమును వాడుచున్నవట! వారి కేమి లోటు? ఏడాదికిఁ, గాలిమీఁదఁ గాలువేసికొని కూర్చుండిన యెడల, నైదువేలరూపాయలు వచ్చునట! పైగ వడ్డీవ్యాపారము వల్ల, మూఁడువేలు వచ్చునట! ఈకారణములచేత, నెక్కడలేని బంధువులును, బిలిచినవారును, బిలువనివారును వచ్చి, యిల్లం తయు గుల్లచేసి పారవేయు చున్నారట! వేయేల? ఇల్లంతయు, పదినాలుగుదినములవఱకు పెద్దదివ్యమున్న భవనమేమో! వచ్చిన

పెద్దవారికేకలంతోడను, చిన్నపిల్లలయేడ్పులంతోడను, బదినత్రిము
లవలె రణగొణధ్వనితోనిండిపోవు చుండఁగా, నొకనాఁడు, పది
గంటల కందఱును, భోజనములు చేయుసమయమునకు, ఫైక్
డ్రెస్‌తోఁ, ధగధగలాడెడు రోల్డ్‌గోల్డ్ సులోచనములతోఁ,
జేతిలో బెత్తము మాడించుకొనుచుఁ, గిఱ్ఱుకిఱ్ఱు మనుబూట్సుతో,
మనవాఁడు వింతచూపులఁ జూచుచు దిగినాఁడట! వానినిజూచి,
యింటనున్నవారందఱు డంగయిపోయినారట! వచ్చుచునే
వచ్చి, తండ్రిగారినిఁ జూచి, ,,నాన్నగారూ! ఇప్పుడే సేఫ్‌గా
వచ్చినానండి!" అనిచెప్పఁగానే, పాప మాయన పెద్దవాఁడగు
టచేతను, నిజముగా వాఁడు, చనిపోయియే యుండిన యెడలఁ,
దమకుఁ బున్నామనరకబాధలు దప్పకకలుగునేమో యనియును,
ఆ స్త్రీయంతయు నేమగునో యనియును, రాత్రియుఁ బగలును,
నిద్రాహారములమీఁద దృష్టియేలేక యుండుటచేతఁ, గుమా
రునిఁ జూడఁగానే, చాలసంతోషించుచు, మధ్యమధ్య వెక్కి
వెక్కి యేడ్వ నారంభించినారట!

,,నాయనా! ఏమయినావురా? ఎక్కడకు వెళ్ళినావురా
పెద్దవాళ్ళను మమ్మీలాగున నెందుకేడ్పించుచున్నావురా?"
అనితల్లిదండ్రు లిరువురును మఱింతగట్టిగా, నేడ్చుటకుఁ బ్రారం
భింపఁగా, ,,ఏమండీ! ఫియర్ ఏమీ లేదండి! పరీక్షపేపర్లలో
మార్కులు వేయించుకొనుటకు మెడ్రాస్ వెళ్ళినానండి! ప్యాస
యిపోయినట్టేనండి" అని యబద్ధములు చెప్పినాఁడట! అప్పు
డందఱు నేడ్పులు మానివేసినాఁట! తరువాతఁ జాలఁ జిత్రము

జరిగినదిసుమా! వచ్చినపురోహితుఁ డూరకపోవునాఁడు గాఁడు గదా! ఊరకపంపుటకూడ ధర్మముగాదు. కావున, నంతకంటె డబ్బుల్ ది యొకరాంటు, ధనవంతులుగాక, రెండువందలరూపా యలు చేతిలోఁ బెట్టఁగాఁ, గాలసంతోషించుచు, బైసికిలెక్కి వాగనిబెల్ అదేపనిగ వాయించుకొనుచు స్వగ్రామమునకు వెళ్లిపోయినాఁడట!

ఓరీ! ఇంకముందు, పురోహితులు, మోటార్ కార్స్ మీఁద వచ్చి, తద్దినములు మొదలగుకార్యములు చేయించి, పోవుచుందురుసుమా! అప్పు డంతయుఁ జాలబాగుగా నుండును సుమా! ఎర్లీమార్నింగుననే యంతయుఁ బూర్తియగుచుండును, అప్పుడు కాఫీటీల కేవిధమయిన యడ్డముండదు. పితృదేవతలు నేడాదికొకసారి శీఘ్రముగాఁదినఁ, త్వరగాఁ దరించుచుండుటను, నేవిధమయిన యాటంకము నుండదుసుమా!

సిగరెట్:—ఈసమాచార మంతయు మార్గములోనే విన్నాను. ముఖ్యప్రాణరావును, భీమేశ్వరరావు సిద్దలుగూడ, మంచిస్నేహితులే. ఈమధ్య నొకజ్యోతిష్కుని బ్రశ్నలువేసి, ముందుసంగతులనుగుణించి, బాగుగా నాలోచించి చెప్పవలయు నని యడిగినారట! అందు కాయన, నాసంగతి నంతయు ముందుగా నెఱిఁగినవాఁ డగుటచే, దారకములు, దిథులు, వారములు మొదలగునవియెల్లఁ జక్కఁగా నాలోచించి, లెక్క లువేసి, మిక్కిలి బాగుగా నున్నదనియు, ముఖ్యప్రాణరావున

కింక రెండునెలలలోఁ, బిడ్డవివాహము దప్పక సంభవించు ననియు జెప్పినారట! ఆసంగతి పెద్దలును జాలసంతోషించు చున్నారట! లోకములో దత్తతపుత్రులయాలోచనలు చాల వఱకిట్టి వేసునూ! పెద్దవాడయిన తండ్రిగారిప్రాణములు గుటుక్కుమనినతోడనే, వారిద్దఱు నెన్నిచెన్నపట్టణములు, ఎన్నికలకత్తాలు, ఎన్ని బొంబాయిలు చూచివచ్చెదరో, తరువాత వినవలెను. తరువాతఁ, దప్పక, యంతయు, నావిధిలాగున నెగిరి పోవుననుమూ! అట్టిసంగతులను మన మీపదియేండ్లలో నెన్ని, వినియున్నాముకామ? ఎన్ని చూచినాముకాము? ఎవ్వ రేమి చేయఁగలరు? ఎవ్వని సొమ్మెవ్వఁ డేలాగున గుటుంచివేయవలయునో, యేలాగున భాగించి వేయవలయునో, యెవ్వరు చెప్పగలరు? ఏలాగునైనయినను, గానున్నది గాకమానదని యున్నదిగదా!

ఇంక మనస్నేహితులు మఱిగ్గురునుగూడ నుండినఁగాని, మనసభను నిండే యుండదు. ఎఱుఁగవా? వినలేదా? మనరాధామాధవుఁ డిప్పుడు, పూర్వపురాధామాధవుఁడు గాఁడునుమూ!, వాఁ డిప్పుడు దేశములో మహాపండితకవి యయి, గొప్పగొప్ప పట్టణములలో, నష్టావధానములు, శతావధానములు, నేత్రావధానములు చేయుచు, ననేకమెడల్సులు, కుండలములుమురుగులఁజోళ్ళు, మొదలగునవిసంపాదించుకొని, యందులోఁగొన్నిమార్చివేసి భార్యనిరంతరము బాధించుచుండుటచేత; నామెపోరుఁ కాగలేక, నగలుఛేయించిపెట్టుచు, నెమ్మదిగా, సుఖముగా, గౌరవముగా,

సంసారసాగర మీఁదుచున్నాఁడుసుమా! మనస్నేహితులందఱిలో, వానిపనియే బాగుగా నున్నది. ఇప్పటికి, వానినిగురించి జరగినసభలలోఁ బదికోట్లచప్పట్లుమనను గొట్టినారని నాతో నుప్పొంగుచుఁ జెప్పినాఁడు. మనలో వాఁడు చాలఁబ్రఖ్యాతిఁ పురుషుఁడగుచున్నందుకు, మనమందఱమును సంతోషింపవలసి నదే.

ఈమధ్య, నాకొకసారి కనఁబడినాఁడు. ఎన్నియో సంగతులనుగుఱించి, యెంతయో యుత్సాహముతో, మాటాడినాఁడు. ఎఱుఁగుదువుగదా! నాకు మతవిషయములు, పెద్దలవలనను, బుద్ధిమంతులవలనను, దెలిసికొనవలయు ననెడుయభిలాష చాలకాలమునుండి యున్నదని నే నదేపనిగ నీతోఁ జెప్ప నక్కఱలేదు. అట్టియభిలాష, నా కేకారణముచేతఁ గలిగి యున్నదో, యదిగూడఁ గొంచెము చెప్పెదను, వినుము.

నేటి కించుమించుగా నూఱు సంవత్సరములక్రిందట జీవించియుండిన మాపితామహు లగు శ్రీమన్నారాయణ దీక్షితులుగారు, మనతెనుఁగు దేశమునందు, మిక్కిలి ప్రసిద్ధిఁ జెందిన గొప్పజ్యోతిశ్శాస్త్రపండితులు. ఆకాలమునం దాయన మహోన్నతదశయం దున్నసువర్ణగిరిసంస్థానాధిపతు లయిన, ధర్మపాలమహారాజుగారి సంస్థానమునం దాస్థానపండితులుగా నుండిరి. ఆమహారాజుగారికిఁ, జాలకాలమువఱకును, బుత్రసంతానము లేనందున, నాయన నిరంతర చింతాక్రాంత మనస్కు లయి యుండెడివారు. ఒకనాఁ డారాజేంద్రుఁడు, మంత్రులు,

పురోహితులుపండితులు మొదలగువారనేకులు నిండి యున్న సభలోఁ గూర్చుండి రాజ్యాంగవిషయానేకవిషయములనుఁ గూర్చి, సంభాషించుచు, నెట్టకేలకుఁ దమకుంగల గొప్పవిచారకారణముం దెలియఁజేసిరి. గతాగతవిషయములను దెలిసికొనుటయందు, మిక్కుటమగు సామర్థ్యముగలవారగుటచే, మానారాయణదీక్షితులుగారాసంగతినంతయు, నిమిషములో గ్రహించి, యించుక కన్నులు మూసికొని, యిష్టదైవమును బ్రార్థించి, జ్యోతిశ్శాస్త్రానుసారముగా, నాలోచించి యాలోచించి, యొకసంవత్సరములో, నామహారాజుగారికి, సర్వసుగుణ సౌందర్యవంతుఁడును, వంశపావనుఁడు నగునొకకుమారుఁ డుదయించు నని చెప్పియుండిరి. ఆసంతోషకర మయినవార్త వినినదిమొదలు కొని, యామహారాజుగారెంతయు, సంతోషములోఁ గాలము గడుపుచుండిరి.

శాస్త్రములు చదివి యున్న, సంపలిసంగతులను జక్కఁగా గ్రహింపలేక, శాస్త్రపండితుల మని, చెప్పుకొనుచుండెడి వారలు, చెప్పెడిపంశములయం దసత్యము లుండుట నిశ్చయము. కాని, శాస్త్రము లెన్నడు నసత్యములుఁ గానేరవు. కావునఁ, జెప్పినప్రకారముగా నొకచక్కనికుమారుఁ డామహారాజుగారికిఁ, గలిగినందునఁ, జాల సంతోషించి, వారు మాకు వంశపారంపర్యముగా, సుఖముగా, నాచంద్రతారార్కముగా, ననుభవించుటకుఁ, జంద్రవరాగ్రహారమును, బహుమానముగా నొసంగిరి. అందువలన, మాకిప్పుడు, సంవత్సరమునకు వేయిరూపాయలు వచ్చుచుండుటచే, నన్నవస్త్రాదుల కేవిధ

మయినలోపము లేకుండ, సుఖముగా, గౌరవముగా, గాలము గడపుకొను చున్నాము.

మాతండ్రిగా రగువిశ్వేశ్వరసోమయాజులుగారికి, మేము నలుగురుకుమార్యలము జన్మించితిమి. మాతండ్రిగారి కేశాస్త్ర మన్నను, నెంతయో యభిమానము. మాయగ్రిసహోదరు లగు హరిహర శాస్త్రిగారు, దాము, మళయాళదేశమునకు వెళ్ళి, యక్కడ మంత్రిశాస్త్రపండితులయొద్ద. మంత్రిశాస్త్ర మును జక్కగా నభ్యసించి, దేశమునకు దిరిగివచ్చి, భూత వైద్యమువలన ధనమును సంపాదించవలయు ననెడితమయభి లాషను, దెలియఁ జేయుటచే, నందులకు, మాతండ్రిగా రంగీక రించినందున, నాయన మళయాళదేశమునకు వెళ్ళి, నేటికిరమా రమి, పదిసంవత్సరములు గావచ్చినది. మంత్రిశాస్త్రము నాయన యెంతవఱ కభ్యసించి యున్నారో కాని, గూారేసి మాసముల కొకసారి యైదేసివందలరూపాయలు మాకుఁ బంపు చుండెడువారు. వారక్కడేలాగునఁ జేయుచుగు చున్నారో, మా కందఱి కిప్పటికిని దేవరహస్యముగానే యున్నది.

ఇంక మారెండవయన్నగా రగునారాయణదీక్షితులు గారు, మాతండ్రిగా రెప్పుడును రామమంత్రిమును జపించు చుండు పెద్దవా రగుటచేత, నింటివ్యవహారములును, వ్యవసా యపు వ్యవహారములును, జూచు చుండెడువారు. మామూా డవయన్నగా రగువిశ్వేశ్వరావధానులుగారు, మాగ్రామము నకు సమీపముగా నున్నతమాషాపట్టణములో నున్నశ్రీమో

హింగీదేవతాలయమునకు సంబంధించియున్న మహాదివ్యమయిన సత్రములో, స్థాపింపఁబడియున్న సంస్కృతపాఠశాలయందుఁ, దర్కము, వ్యాకరణము, ధర్మము, మీమాంస, వైద్యము, జ్యోతిషము, అనుశాస్త్రములును, కావ్యాదులును జదువుకొనుచున్న యేఁబదిమంది విద్యార్థులలో, నొకరుగాఁ జేరి, యా సత్రమునందే, హాయిగా మూఁడు పూటలు భోజనము చేయుచు, నాపాఠశాలయందలి యుపాధ్యాయులలో నొకరగు బలిష్ఠశాస్త్రులవారియొద్ద, రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, ననుమూఁడు కావ్యములను ముగించి, నైషధము నారంభించి, యిప్పటి కందులో, సగము ముగించియున్నారు. ఈమధ్య నొకసారి, దసరాపండుగుసెలవులలో, మా యింటికి వచ్చి, తాము చదువుకొనినకావ్యములలోని, కొన్నిశ్లోకములను, మాతండ్రిగారియొద్దఁ జక్కఁగాఁ జదివిచెప్ప డాయన చాలసంతోషించిరి.

తరువాత, నైషధమహాకావ్యమునందలి కొన్నిశ్లోకములను జదివినప్పుడు, మాతండ్రిగారు, గీర్వాణాంధ్రములయందు, మంచియపారమైనపాండిత్యము గలవారగుటచే, నాశ్లోకములను విని, పరమానందము నొంది, గదిలో నున్నశ్రీనాథమహాకవివిరచితనైషధమహాకావ్యమును దెప్పించి, యందలి,

ఉ. అంతరమెట్టిదో యని, నిజాస్యముతోఁ, బ్రతివెట్టి, రోహిణీ
కాంతుఁ బరీక్షసేయుటకుఁ గానటుపట్టిన భంగిలీల న

య్యంతిధరించె భూషణములెల్ల వహించిన యంతమీఁద శు
ద్ధాంతవధూటియొక్క తెస్రియంబుఁ నిచ్చినమించుటద్దమున్.

అనుపద్యమును జూపించి, „నాయనా! చదువు” మనిరి, అందులకు, మాయన్నగారు, మొట్టమొదట, నెంతసో యుత్సాహముతో „ఇదెంత” యని, యారంభించి, తికమకలతో, నెట్టులో యొకరీతిగా, నాపద్యము నీడ్చి యీడ్చి, తుద ముట్టించిరి. అప్పుడు మానాయనగారు, మాయన్నగారినిఁ జూచి మందహాసముచేసి, „నాయనా! నీవు సంస్కృతమునం దెంత పాండిత్యమును సంపాదించుకొన్నను, ఆంధ్రకావ్యములలోఁ, ఖ్యాతము లయిన „మనుచరిత్రము” „వసుచరిత్రము” „ఆముక్తమాల్యద” అనుమూఁడుగ్రంథరాజములనుగూడఁ జదివిన, నీకుఁ గీర్వాణాంధ్రంబులయందుఁ, జక్కనిపాండిత్యము, తప్పక కలుగునని చెప్పి, యానాఁడె, యామూఁడుపుస్తకములను కొనుటకుఁ దగిన సొమ్మిచ్చిరి. అదిమొదలు, యాపుస్తకములను గొని, యవిగూడ నిప్పుడు శ్రద్ధగాఁ జదువుకొనుచున్నారు.

ఇంక, నాసంగతి, సూక్ష్మముగాఁ, జెప్పుచున్నాను. వినుము. నేను మొట్టమొదట ప్రైవేటుగా సిగరెట్లెక్కువగాఁ గాల్చునట్టి స్వభావముగలవాఁడ నగుటచేత, ఫస్ట్ఫెలోస్, నాస్నేహితులు, నాకు, సిగరెట్‌రావని పేరుపెట్టి, పిలుచుచుందురు. కాని, మాయింట, నొకశాస్త్రియు, నొకదీక్షితులును, ఒకయవధానియు, నొకసోమయాజులు నుండుటచేతఁ, గాలానుసారముగా „రావు” గల పేరు పెట్టవలయు నని, మా

తల్లిదండ్రులు చక్కఁగా నాలోచించి, నాకు, బ్రహ్మానందరావని పేరుపెట్టి, పిలుచు చున్నారు.

ఈకాలమునందు, జనులలో, యజ్ఞాదులయందుఁ, బూర్వకాలమునందువలె, విశ్వాస మంతగాలేక, క్రిమక్రిమముగా నట్టివిశ్వాసము క్షీణించిపోవుచుండుటచే వేదశాస్త్రములును, గావ్యములు నంతగాఁ ధనమును సంపాదించుకొనుటకు, బలముగలసాధనములు గావని తలంచి కాఁబోలు, నా కింగ్లీషు విద్యను నేర్పించినచో, నే నే బియ్యే బియలో, యే యెమ్యే యెమ్మెలో, ప్యాసయి, దోసిళ్లతో రూపాయలు దెచ్చి, తమ చేతులలోఁ బోసెద నను నమ్మకము చాలఁ గలిగి యుండెడివారు.

ఈలోకములోఁ, దల్లిదండ్రు లాప్రకారముగాఁ దమ కుమాళ్లనుగుఱించి, యెక్కువ దూరాలతోఁ గూడినయాలోచనలను గలిగియుండుట, యొకగొప్పవింత గాదుగదా! అయ్యది స్వాభావికము. తరువాత, నన్నొకచిన్న యింగ్లీషుపాఠశాలలోఁ, బ్రవేశపెట్టిరి. నేనును, గ్రమక్రమముగా, నక్షరములను, జిన్న చిన్నమాటలను నేర్చుకొనుచుఁ, బ్రతిసంవత్సరపుఁ బరీక్షలలో జయముఁ గనుచుఁ, బ్రథమతరగతిలోకి వచ్చి, చక్కఁగా జదువుకొనుచు, సంవత్సరపుఁబరీక్షలో, జయముపొంది, రెండవతరగతియందుఁ బ్రవేశించి, చదువుకొను చుంటిని.

ఈప్రకారముగాఁ, గాలమొక మహాస్వప్నప్రవాహము వలెఁ గడచిపోవుచుండఁగా నొకనాటి సాయంకాలమున, సూర్యుఁ డస్తమించు చుండుసమయమునకు, నేను, నాస్నేహి

తులతో నాఁడుకొని, యింటికి వచ్చునప్పటికి, మాయింటియొద్ద నిద్దఱు నిలచియుండిరి. నేను వారిం జూచి, ,,మీరెవ్వరు? మీ కెవ్వరియిల్లు కావలె" నని యడుగు చుంటిని. అంతలో మా తండ్రిగారు, లోపలినుండి, వీధిగుమ్మముకొద్దకువచ్చి, ,,అమ్మా! మీరెవ్వ" రని యడిగిరి. అందు కామె, ,,అయ్యా!. మాది శ్రీకృష్ణపురము కాపురస్థలము. ఈచిన్నవాఁడు నాకుమారుఁడు. తండ్రిలేనియీకుమారున కింగ్లీషు చెప్పించుకొనవలయు నను నుద్దేశముతో, మాయూరు విడిచి, యిక్కడకు వచ్చినాను. మేము మిక్కిలి బీదవారము. నాపేరు లక్ష్మీదేవమ్మ" యని యందురు. అని చెప్పినతోడనే, మార్గాయాసముచేఁ, జాలబడలి యున్నవారిం జూచి, చాల జాలి నొంది, తెలివితేటలు గల మొగముగల యాచిన్నవానివంకఁ జూచి. ,,అబ్బాయీ! నీపేరేమి? నీవేమిచదువుకొనుచున్నా" వని యడిగిరి. అప్పుడాచిన్న వాఁడు, ,,అయ్యా! నాపేరు పార్వతీశము. నేను మెట్రిక్యులేషన్ క్లాసులోఁ జదువుకొను చున్నానండి" అని చెప్పెను.

అంతకుముందే, నాకింటియొద్ద నొకయుపాధ్యాయు నేర్పాటు చేయవలయు నని, మాతండ్రిగా రాలోచించు చుండిరి. కావున, సంతోషించి, నన్నుఁ జూచి, ,,నాయనా! వీరిని లోపలికిఁ దీసికొనవెళ్ళి, భోజనము పెట్టింపు" మని చెప్పిరి. అప్పుడు, నేను వారిని, లోపలికిఁ దీసికొనిపోయి, మాతల్లిగారితోఁ జెప్పితిని. మాతల్లిగారును, వారిసంగతి నంతయు విని, స్త్రీస్వభావ మూరకపోదు గావునఁ, గన్నుల నీరుపెట్టుకొని, వారిమొదల

నెంతయో జాలిపడి, యానాటిరాత్రి, వారికి భోజనముపెట్టిరి. తరువాత, మాతండ్రిగారు రాచిన్నవానిని, నాకింటియొద్దఁ జదువు చెప్పుటకు నిర్ణయించి, తల్లియును, గుమారుఁడును, మాయింటనే భోజనము చేయుచు నుండవచ్చునని, తెలియఁజేసిరి. అందులకు వా రెంతయు సంతసించిరి.

నేను బ్రతిదినమును, బగలు పదిగంటలకు, సరిగఁ బాఠశాలకు వెళ్లవలసి యున్నది. పార్వతీశముగారు రుదయ మూఁడుగంటలుమొదలుకొని తొమ్మిదిగంటలవఱకును, నాపాఠముల న్నియుఁ, జక్కఁగాఁ జెప్పి, విడిచిపెట్టుచువారు. అదేప్రకారముగా, సాయంకాల మైదుగంటలకు, నేను బాఠశాలనుండి వచ్చినతోడనే, మరల నాలుగుగంటలవఱకును, మఱునాటి పాఠములను, జెప్పుచుఁ, బాఠ్యపాఠముల నక్కడక్కడ నడుగుచువచ్చిరి.

ఇట్లు పగలంతయు, నుదయ మూఁడుగంటలు మొదలుకొని, సాయంకాల మూఁడుగంటలవఱకును, నామనస్సు గానుగలో నాడఁబడునట్లుగాఁ, జదువులో ముంచివేయఁబడుచు, రాపాడఁబడు చుండుటచేఁ, గ్రమక్రమముగా, నాయారోగ్యము చెడి పోవుట కారంభించినది. ఆసంగతిని, శీఘ్రముగా, మాతండ్రిగారు గ్రహించి, యంతటినుంచి, ప్రతిసాయంకాలము, నాయిష్టమువచ్చినట్లుగాఁ, గొన్నినెల లాడుకొను చుండవలయు నని తెలియఁజేసిరి. ఆప్రకారముగాఁ, బ్రతిదిన మాటలాడుకొను చుండుటచే, నా దేహారోగ్యము బాగుపడుట కారంభించుటయే

కాక, నామనస్సునకు సహితమెంతయు సంతోషకరముగ నుండ నారంభించెను.

ఇట్లొకమాసము గడచినతరువాత, లక్ష్మీదేవమ్మగారును, పార్వతీశముగారును, మాయింటిపొరుగువారు, దమయింట నొకచిన్నభాగ మూరక, యద్దెలేకుండ నిచ్చుటచే, నందుఁ బ్రవేశించిరి. తరువాత, లక్ష్మీదేవమ్మగారు, మాగ్రామములోని ప్రతియింటికి, ముఖ్యముగా, సాయంకాలసమయములయం దందఱును, భోజనములుచేసి, మాటలతోడను, పాటలతోడను, ఆటలతోడను, గ్రంథకాలక్షేపములతోడను, వేదాంత సంభాషణములతోడను, సంతోషముగా నుండునప్పుడరిగి, చిన్నవారలకు, పెద్దవారలకును, గోపపాట, గోవిందారామపాట, లంకాయాగము, కుశలవకథ, హనుమద్రావణసంవాదము, పార్వతిపెండ్లి, దక్షయాగము, జోలపాటలు, భద్రాద్రియాత్ర, సీతమ్మశోకము, మొదలగుపాటలు నేర్పుచు, గావలసినపదార్థములను దెచ్చుకొనుచు నందఱికినిఁ, దలలోనినాలుకవలె మెలఁగుచు, మిగులశ్రావ్యముగాఁ బాడుటయం దెక్కువసామర్థ్యము గలిగినవారగుటచే, నందఱిచే, సంతోషపూర్వకముగా, సాయము చేయఁబడుచుఁ, ‟పాటలలక్ష్మీదేవమ్మగా" రనుపేరిట, నందఱికంటె నెక్కువగా నెంతయు సుఖముగాఁ, గాలము గడపుకొను చుండిరి.

ఇంటియొద్దఁ బార్వతీశముగారు, నాకుఁ జక్కఁగాఁ జదువు చెప్పుచుండుటచేతను, నాశరీరమునం దారోగ్యము

బాగుగా నుండుటచేతను, నాకుఁ జదువునం దభిలాష దినదినాభివృద్ధి నొంద నారంభించెను. నేను గ్రమముగా, నుదయమునను, సాయంకాలమునందును, బార్వతీశముగారు, గొత్తగాఁ గాపుర మున్నయింటికిఁ బోవు చుంటిని. వా రప్పుడు, కాపుర మున్నయింటిదొడ్డిలో, ననేకవిధము లయినపక్షులకలకలధ్వనులతో, నానందజనకంబుగ నుండెడు నొకగొప్ప తియ్యమామిడి చెట్టు గలదు. ఆచెట్టుక్రింద, నొకచాఁపమీఁదఁ గూరుచుండి, నాపాఠములను జదువుకొను చుండెడువాఁడను.



# జ్ఞానభాస్కరము.

## తొమ్మిదవ ప్రకరణము.

---

పార్వతీశముగారికిఁ, బదిమంది స్నేహితులు గలరు. ఆకాలములో, దేశమునందు, బ్రహ్మసమాజ మతమునుగురించి యెక్కువగా, సంభాషణములు జరగు చుండెడివి. ఏకాలమునందు ఏదేశమునందు ఏవిషయమునందును గ్రొత్త యొక వింత గదా! దేశములో, ననేక ముఖ్యపట్టణములయందు, బ్రహ్మసమాజములు స్థాపింపఁబడు చుండెను. వారు ప్రతిదినము, శ్రీరాజారామమోహనరాయలు వారిం గూర్చియుఁ, గేశవచంద్రసేనులుగారినిఁగూర్చియు, ననేకపత్రికలనుండియు, ననేకగ్రంథములనుండియు, నెన్నియో విషయముల నెంతయు నుత్సాహముతోఁ జదువుచుండిరి. అవి యన్నియు, నాకుఁ గొంత దెలియుచుండినను, గొంత దెలియక యుండినను, మిగుల శ్రద్ధతో, వినుచుండెడువాఁడను. వారప్పుడప్పుడు, శనివారముసాయంకాలముననో, యాదివారముసాయంకాలముననో, యందఱుఁ జేరి, కొంతసేపు కీర్తనలు పాడుచుండియుఁ, గన్నులు మూసికొని కొంతసేపు ప్రార్థనచేయుచుండియుఁ, గాలము గడపుచుండెడు వారు. అదియంతయు, నామనస్సునం దేర్పడ నున్నమహామహానందదివ్యభవనమునకుఁ బునాదిగనుండెను.

వారుసాడుచుండెడు కీర్తనలన్నియు మతవిషయములను, విశేషముగాఁ, దెలిసికొనవలయు నను ప్రోత్సాహమును, నామనస్సునం దెక్కువగాఁ గలిగింప నారంభించెను. ఆకారణముచే నే నామతమునుగూర్చినయనేకగ్రంథములను జదివి, కొంతకాలము చక్కఁగా నాలోచించినపిమ్మట, నాబ్రహ్మసమాజమతమునం దేయితరమతమునం దును లేనినూతనసుఖదాయకవిషయము లం తగా లేకుండుటన్లే నామనస్సునకుఁ జక్కఁగాఁ బోడకట్ట నారంభించెను. కావునఁ, గ్రమక్రమముగా నామతమునందు నాకు విశ్వాసము, క్షీణింప నారంభించెను.

ఈలోకములో, నేవిషయమునం దైనను, భిన్నాభిప్రాయములుండుట స్వభావసిద్ధమేకదా! అట్టు లుండుటవలననే యభివృద్ధి గలుగు చుండును. సత్యము నెఱుంగుటకు సరియగు మార్గ మేర్పడుచుండుటకు, లేశమయినను, సందేహములేదు. నే నాకాలమునందుఁ జదువుకొను చుండెడుపాఠశాలయందు, మతవిషయము లేవియు, నేర్పఁబడు చుండకయున్నను, మతాంశములయం దెక్కువగా, జ్ఞానమును, సంపాదించుకొనవలయు ననెడియభిలాష నాకుఁ గలుగుచుండుటకుఁ బ్రధానకారణము బ్రహ్మసమాజమతమే యని చెప్పవలసి యున్నది. పిమ్మట, నేడెనిమిది వివిధమతములకు సంబంధించిన యనేకగ్రంథములను జదువు చుండెడువాఁడను. అదియంతయు, నీ వెఱుఁగనివిషయము గాదుగదా!

తరువాత, నకస్మాత్తుగా, నొకనాఁడు మనరాధామాధ, వుఁడు, నన్నుఁ జూడ వచ్చెను. వచ్చినతోడ,నే, వానిం జూచి క్షేమసమాచారముల నడిగి తెలిసికొని, ‘‘యీాతఁడు, వేదము లను, శాస్త్రములను, బురాణములను, జదివి, గొప్పపండితు డయి, దేశములోని గొప్పగొప్పపండితులతో, సహవాసమును గలిగియున్నాఁడు. చాలమంది మతబోధకులతోడఁ, బరిచయ మును గలిగి యున్నాఁడు. ఇంక నాసందేహములు దీఱవచ్చు” ననుగొప్పయాశతో, వాని కనేకప్రశ్న లడిగితిని. ఆతఁడవి యన్నియుఁ, దలయూఁచుచు వినివిని, ‘‘మిత్రుఁడా! జ్ఞాన నేత్రము నించుక, తెఱచిచూడుము. లోకము, వివిధమతాభి ప్రాయప్రవాహములలోఁ, గొట్టుకొనిపోవు చుండుట, నీవు సులభముగాఁ, జూడఁగలవు.”అని, శ్రీమద్భాగవతమునుండియు, శ్రీమద్భగవద్గీతా గ్రంథరాజమునుండియుఁ, గొన్నిభాగములు భక్తి యెంతయు నుట్టిపడునట్లుగా, నెంతయు శ్రావ్యముగాఁ జదివి, మందహాసము చేయుచు, వెళ్ళిపోవుచు, వెళ్ళిపోవుచు,

గీ. పంచభూతంబులందుండి, ప్రభవమందు
జీవిజాలంబు, జగమునఁ, జిత్రగతులఁ,
గాల మెంతయొ! యెట్టులో! కడపుచుండి,
పంచభూతంబులకు నేగుఁ, బ్రకృతియగుట.

గీ. నీడ, ఫలముల, నొసఁగుచుఁ, బొడిఁ గఱప
వసుధఁ బొడమచుఁ, బెరిఁగెడుపాదపముల
పత్రములవలె, మఱియును, ఫలములవలెఁ

ప్రాణివృక్షంబుపత్రముల్, ప్రాణికోట్లు,
మేలొ! కీడునొ! చేయుచు, రాలు నెపుడొ!

గీ. శైశవంబున, నిశ్చింత, జరపి జరపి,
యౌవనమున నాశల, విషయములఁ, జిక్కి,
వార్ధకంబున, మునివృత్తి, వశమె యగుచు,
నలసి, మనసునఁ బరమాత్మఁ, దలఁచు చుండి,
తనువుఁ ద్యజియించు, మనుజుండు, ధరణిఁ దుదను.

గీ. ఒరులకష్టంబులను గాంచి, యూరకొనక,
చేయుకోలఁదిని సాయంబుఁ జేయు చుంట,
యెల్లవారలఁ, దనవలె, నెంచుకొనుట,
యదియ, మత మంచు, నెంచెద, నాత్మయందు,

గీ. అలసట నొసంగుతలఁపులఁ, దలఁపకుంట
పరుల బాధించుపలుకులఁ, బలుక కుంట,
చింత లొసఁగంగ, మోసముల్, చేయకుంట
యదియెఁ మత మంచు, నెంచెదనాత్మయందు.

గీ. తాను జేసినమేలును, దలఁప కుంట,
పరులు మేలును జేయంగఁ, బరముముదముఁ
జెంది, వారికి మేలునె, చేయు చుంట,
కీడు సల్పినవానికిఁ, గీడు నెపుడుఁ,
జేయ కుంటయు, మేలునె, చేయుచుంట,
యదియ మత మంచు, నెంచెద, నాత్మయందు.

గీ. నిర్మలం బగుహృదయంబు, నిర్మల మగు

దేహమును గల్గి, మేలుగా, దేహయాత్రఁ,
జేయు చుండిన, శాంతితోఁ, జెందుసుఖము;
మతము, యది యంచు, నెంచెద, మానసమున.

అని చదివి, „ఇదియేసుమా లోకసార" మని నాకు నచ్చునట్లుగా జెప్పి, వెళ్ళిపోయినాఁడు. ఇప్పు డెక్కడ నున్నాఁడో నాకుఁ దెలియదు.

బీడీదాస్:—ఓరీ! మిఠాయిరావూ! మీరు వెళ్ళినపని యేమయినది?

మిఠాయి:—బాగుగా జందాలు పోగుపడుచునేయున్నవి. ఉపాయశాలి యయినమన తారకరాంగారి యుపదేశము మీఁదఁ దలపెట్టుటయును, గాకపోవుటయునా? ఇంక మనము స్థాపింపఁ బోవుచున్న „పక్షిరక్షకసమాజము" తప్పక, బాగుగ నెరవేరుటకు, దోమకాలంతయినను సందేహము లేదు. నామాట నమ్ము. పదిమంది బ్రతుకఁగలరు. అనేకజీవులు సుఖపడు చుందురు. మనమో, లోకోపకారము చేసినవార మగుదుము. ఆపుణ్యాము మన కంటకుండుగూడ దక్కునుగదా! ఇప్పటి కేఁబదివేల రూపాయలు పోగుపడినవి. మనత్రిలోక చంద్రమహారాజుగారు మనముతలపెట్టినసత్కార్యమున కేఁబది వేలరూపాయల నిచ్చెద మనుసంతోషకరమయిన వార్తను దెలియఁ జేయుచు మనసంఘాధ్యక్షు లగుతారకరాంగారికొకయుత్తరమును వ్రాసియున్నా రనుసంగతి నీవు విని సంతోషించుచునే యుండవచ్చును.

ఆరోగ్య:—స్నేహితులారా ! మీరును, బరోపకారవిషయములనుగుఱించియే, సంభాషించు చున్నారు, అదినాకు, బరమసంతోషమే ఇంక వినుటకు చాలరాత్రి యగుచున్నది. ఈ లోకములో, నారోగ్యమునుగూర్చి, యేమతమువా రయినను, బరమసంతోషముతోఁ, గన్నుల నద్దుకొని, యవలంభింపవలసినయమూల్యము లయినవజ్రములవంటి ముక్కలు నాలుగైదుచెప్పి, నేను జెప్పఁదలచిన దంతయు, సూక్ష్మముగా ముగించెదను.

గీ. జ్ఞాన మెంతయుఁ గలయొకకవివరుండె,
యాశ గలగించు నది, నని, యనుచుఁ దెలిపి,
యాశ బాధించు నది, నని, యనుచుఁ, దెలిపి,
విశువవలె నంచుఁ, దెల్పఁడే వింత గాఁగ?

గీ. అవని, జీవులబంధనం బాశయొకద!
యాశ లేకున్నఁ, గృషి లేదు, లేశ మైనఁ,
గాంచు నభివృద్ధి జగమాశ గారణముగఁ,
గాన, నాశఁ గల్గి, మనాశ మగా నలయు.

గీ. జన్మ, జరయును, దుఃఖముల్, జగమునందు;
జాయ, బిడ్డలుఁ, జంతయే, జగతిఁ; గాన,
నంటి యంటనివిధమున, నవని మనుచు
నున్న, నారోగ్య మెంతయు, నొదవుఁ జుండి!

గీ. సుఖము, మనసునఁ గను చున్న, సుఖమువలెనె,
చింతె, మనసునఁ గను చున్నఁ, జంతవలెనె,

యింద్రజాలంబుపగిదిగ నెసఁగుజగము,
మనసుప్రతిబింబ మగుచుండి, మదికిఁ దోఁచు.

గీ. చిత్ర మగు చుండుజగమున, జీవికోట్లు,
సుఖము, దుఃఖంబుఁ, జెందెడు నఖిలగతుల;
సుఖము, దుఃఖంబు, నొకటిగాఁ, జూచుజీవి,
యవని నారోగ్య మెంతయు నందుఁ గాదె?

గీ. చింత, యారోగ్య మంతయుఁ, జెఱచుఁ, గాన,
జ్ఞాన మెంతయు, మదియందుఁ, గాంచు చుండి,
మృతులఁ దలపోసి, సతతంబు, గతముఁ దలఁచి,
చింతెఁ జెందంగఁ జన దెప్డుఁ జిత్తమందు.

గీ. కనుచు నుండంగఁ, గాలంబు, గడచు చుండుఁ;
గాల మంతయు, మేలుగాఁ, గడపవలయు;
నెట్టు లున్నను నంతయుఁ, దుట్టతుదకు,
మిథ్య యనుజ్ఞానమును గల్గి, మెలఁగఁ జనును.

గీ. కామలోభాదు లిల, నాశఁ, గలుగఁ జేయు,
బహువిధంబుల, మన ననువాసరంబు,
గంతు లిడు చుండు; జ్ఞానంబుఁ గలిగి, దాని,
నాపి, బంధింప, నారోగ్య మగును జుండి!

తిరిత్వము:—అహా! నీవిప్పుడు చెప్పిన వెంతజ్ఞానభోధకము లయినసంగతులు! నీ కెంత తెలివి యయిన నున్నదిసుమా! ఈలాగున దేశమంతయుఁ దిరిగితిరిగి, లెక్చెర్లమీఁద లెక్చెర్లిచ్చిన మొదల, నూటికిఁ దొంబదిమంది, తమశరీరములమీఁద నుండెడు

నగలను, వేలియుంగరములును, గంటెలును, గాసులపేర్లును, ఎంతవిలువగలనగలనయిన నూడదీసి, నీచేతిలోఁబెట్టకమానరు. అప్పుడు, మన మారోగ్యగ్రంథములతోడను, ఆరోగ్యశాలల తోడను, దేశ మంతయు నక్కిరిబిక్కిరి యగునట్లుగా ముంచి వేయవచ్చును. నీ కున్న తెలివి సార్థకముగాఁ జేసికొనవలయు నని కోరుచున్నాను. అప్పుడే నీవు దేశమునకు మహోపకారము చేసినవాఁడ వగుదువు.

ఆరోగ్య:—యస్. బయూల్ మీాన్స్. ఈవచ్చువేసవి కాలపుసెలవులలో, నొకబూర్ కొట్టివత్తము, ఆంధ్రదేశమం తయు, హిరణ్యాక్షునివలెఁ, జుట్టఁబెట్టవలయును.

త్రిత్వము:—మిత్రులారా! నేను మన కందఱకును, వైకుంఠయేకాదశివంటి మహాపుణ్యదిన మని గట్టిగా నమ్మవ లెను. మనము చిన్నవాండ్ర మయినప్పటికిని, స్టూడెంట్స్ మయినప్పటికిని, ఇదియే మొదటిమీాటింగయినప్పటికిని, ఎంత జయప్రదముగా జరగినది! ఇదిగో! నే నిప్పుడే, నాజేబులోని చుట్టలును, సిగరెట్లును, బీడీలును, దీసి, ముక్కలుముక్కలుగా విఱిచి, పారవేయు చున్నాను. చిన్నవాఁ డయినప్పటికి నారో గ్యరావు, శ్రమయని యాలోచింపక మనయందఱిమేలు కొఱ కును, జెప్పిన హితోపదేశములు, నామనస్సులో, నెంతయో లోతుగా నాటి, యెంతచక్కఁగాఁ బనిచేసినవి! మనమీాటింగు లోఁగూడ, లాంఛనము లన్నియు, బాగుగనే జరగు చున్నవి.

ఎప్పుడు, నల్పారంభమే, మహాఫలమునకును, మహాశ్రేయస్సునకును, మూల మగు చుండునుగదా!

వాట్! వాట్! అదిగో! సిగరెట్ రావుగారును, బీడీ దాసుగారును, మీాటెం గని యయిన నాలోచింపక, క్రీపింగును గ్రిపింగును బట్టుకొని, ఇంగ్లీషుతోను, దెలుఁగుతోను, దిట్టుకొనుచు, బాగుగాఁ గొట్టుకొనుచుఁ, దన్నుకొనుచున్నారు. అయ్యో! పాపము! బీడీదాసుగారు, సిగరెట్ రావును, గూబ గుయి మనునట్లుగాఁ, జేతికొద్ది, ఒకలెంపకాయ తీసికొట్టి, గొడుగుతోఁ, జేతిమీాఁదఁ గొట్టినాఁడు. అయ్యో! సిగరెట్ రావుగారు పడిపోయినాఁడు!

భరద్వా:—ఎక్కడిదిరా యీయాల?

త్రిత్వము:—స్కాటు గాఁబోలు! అదుగో! మనఫ్రెండ్స్, ఉపకారరావును, వామనరావును, వచ్చుచున్నారు.

ఉపకార:—అబ్బో! నేటికి, నేనుఁగూడ నొక స్కాటు నైతిని. డబ్బయిననేమి? ఈడ్రెస్సు చూచినయెడలఁ, జాల ముచ్చటగా నున్నది. ఇదివేసికొన్నప్పటినుండియు, నెక్కడలేని తెలివియుఁ, జాణతనమును, సత్తువయు, వచ్చుచున్నట్లుతోఁచుచున్నది. ఈబెల్టు, ఈదుస్తుకట్టయు, ఈరంగురంగులరుమాలును, నాకొక క్రొత్తయందమును గలిగించుచు, నన్నొకక్రొత్తవానివలె మార్చివేయుచున్నవి. స్కాటు నయినా నని, నాలో నేను, సంతోషించుచుండుటవలన నింతయు లాభము లేదు.

ప్రతిరోజున నేదియో యొక యుపకారకార్యము దప్పక చేయు చుండ వలయును.

గీ. శాంతిఁ జింతింపు మోమానసంబ! పేర్మి
నిష్ట మగుచేల, దైవంబె, సృష్టి చేయుఁ,
గష్టమే, భువి, హెచ్చుగాఁ, గానఁబడదె!
బలులు, దుర్బలులకు, నిల బాధ లిడరె?

గీ. చిత్ర మగుఁ గాదె లోకంబు చింతచేయఁ?
జింత, సుఖమున, భువి నీదుజీవికోట్లు;
జననమరణంబు లివి రెండు, జగమునందుఁ,
బగలు, రాత్రియు, జీవికి; వశమె యెఱుఁగ?

గీ. మనసు, మాటయుఁ, గార్యంబు, మంచి యెపుడుఁ,
గలిసి యుండంగ, మనుజుండు, గాంచు చుండి,
తెల్లవాఱిన దాదిగ, దినదినంబుఁ,
జేత నగునంతమేలును, చేయవలయు.

ఓహో! నాదేశస్థులు, నాదుస్సంగతులు, నాశీవి నడకయును, జూచుచుండెదపిల్లలును, పెద్దలును, ముసలి వాండ్రు, నందఱుఁ, దెల్లతెల్లపోయి, చూచుచుఁ, దప్పుకొని పోవుచుందురు. ఇదిగో! స్కూలుపిల్లలు, కొట్టుకొనుచున్నారు. పాపము! ఈచిన్నవాని చెయ్యి, పెద్దకప్పలాగునసే, యుబ్బి పోయినది. అయ్యో! పడిపోయినాఁడే! వీనిని, బుజముమీఁదఁ దీసికొనిపోయి, వైద్యశాలలో నప్పగింపవలసియున్నది. ఒక్కఁ డను మోసికొని పోలేను. ఓరీ! వామనరావూ! రారా: ఓరీ!

ఏమిరా! నీ వంత నీరసముగా నడచుచున్నావు. నీవుచూచిన నింతయున్నావు. నీచేతిలోని దుడ్డుఁగఱ్ఱఁజూచిన నంతయున్నది. నీవు నడచుచు వచ్చునప్పుడు, నీవేదుడ్డుఁగఱ్ఱను దీసికొనివచ్చుచున్నావో! లేక,నీచేతిలోనిదుడ్డుఁగఱ్ఱయే నిన్నుఁదీసుకొనివచ్చుచున్నదో యని, నాకు సందేహముగలిగి, చాలనవ్వు వచ్చినది.

వామన:—ఇదిగో! వచ్చినాను. (అని యిద్దఱును సిగరెట్ రావును, మోసికొని పోవుచున్నారు.)



# జ్ఞానభాస్కరము.

## పదవ ప్రకరణము.

---

తారక:—మిత్రులారా! ఇప్పుడు, సభ ముగిసిన దని మీ రనుకొనవద్దు. దయచేసి, మీ రందఱును, బదినిమిషములు గూర్చుండవలయు నని, నాకోరిక. నాప్రార్థన. మన మెప్పుడును బూజ్యు లయినమనపెద్దల మంచిపూర్వాచారములను, దప్పించి వేయఁగూడదు. సభ ముగిసినతరువాతఁగూడ, సభలోనివా రెవ్వరయినను, బుద్ధిమంతులు గొన్నికొన్ని ముఖ్యాంశములు చెప్పవచ్చును.

దేశమును, బాగుచేయుటకు, మనము సదా పాటుపడు చుండవలయు నని, ముఖ్యముగా నుత్తరహిందూస్థానములోను, దక్షిణ హిందూస్థానములోను, దేశమందంతటను, బెద్దపెద్ద యుద్యోగములలో నుండుటచేతను, బాగుగా జరుగుఁబాటుకు దగినంత డబ్బుండుటచేతను, డబ్బున్నను, లేకపోయినను, జీవనము జరగుటకుఁ గావలసినంతమట్టు కెంతయో, యేలాగుననో చేతిలోఁ బడుచుండుటచేతను, విద్యాధికు లయినపెద్దలును, వారిని విడచిపెట్టలేక, యంటిపెట్టుకొని యుండెడుపిన్నలును, గొప్పగొప్పసభలో, చిన్నచిన్నసభలో చేయుచు, దేశము యొక్క పురోభివృద్ధికొఱకును, మనవిద్యార్థులే, మూలకారణ్యగా

నుండవలసినవా రని, యనేకవిధముల వినువారిమనస్సులలో, బాగుగా నాటుకొనునట్లుగా, గంభీరోపన్యాసములు చేయు చున్నారు.

విద్యార్థులుగా నుండుకాలమునందు, విద్యాభ్యాస మందుమాత్రమే, ముఖ్యముగా దృష్టి యుంచవలసినవిద్యార్థులు రాజ్యాంగాది విషయములలో సంబంధమును గలిగించుకొనవల యునుపభోధించుట, యనర్థదాయక మనునంశము నించుకయు నాలోచింపక, యదియే పనిగాఁ గొందఱు చెప్పుచున్నారు. ఎఱుఁగుదువా? ఇప్పుడు మన ఆరోగ్యరాప్రుచదివిన

గీ. కామలోభాదు లిల నాశఁ గలుగఁజేయ,
బహువిధంబుల, మన సనువానరంబు,
గంతు లిడు చుండు; జ్ఞానంబుఁ, గలిగి, దాని,
నాపి బంధింప, నారోగ్య మగును జుండి!

అనుపద్యములోని ‹‹వానరం” బనుశబ్దము, నా కివ్వా డొక ముఖ్యాంశమును, జ్ఞప్తికిఁ దెచ్చు చున్నది.

ఈలోకములోఁ, బ్రధాన మతముగా నుండవలసిన మతము, కరుణమతమేకదా! అట్టివిషయములో, మతగ్రంథ ములకు, శ్రీశంకరాచార్యులవారును, శ్రీరామానుజాచార్యుల వారును, శ్రీమాధవాచార్యులవారును, దమతమజ్ఞానము ననుస రించి, వేలువేలుమహాభాష్యగ్రంథములను వ్రాసి, భక్తికిని, ముక్తికిని, మొట్టమొదట విగ్రహారాధనమే ముఖ్య మని యొక రును, బహునామధారణమే ముఖ్య మని యింకొకరును, ముద్ర

ధారణమేముఖ్య మని మఱియొకరును, సిద్ధాంతములను స్థాపించి నట్లే, పైపద్యమునకు భాష్యమును వ్రాసి, సిద్ధాంతమును జేయు చున్నాను. వినండి. నేను హృదయపూర్వకముగా, మేలునే కోరి, చెప్పుచున్నాను. అగ్రిహింపవల దని నాప్రార్థన.

వానరము లనఁగా, మర్కటములేకదా! మర్కటము లనఁగాఁ గోఁతులేకదా! కోఁతుల కస్థిరచిత్తము లుండుట, స్వభావసిద్ధమేకదా! బాలురుకూడ, స్థిరచిత్తముగలవారుగ నుండకుం డుట, స్వభావసిద్ధమేకదా!

చదువుకొను చుండుపట్టణములయందుఁ దల్లిదండ్రులు గలపిల్లలవిషయములో, మనమంతగా, నాలోచింపవలసిన పనియే లేదు. కాని, యితరగ్రామములలోఁ, దల్లిదండ్రులు గలపిల్లలవిషయములో, మనము, కొంచెము నిదానించి, బాగుగా నాలోచింపవలసి యున్నది.

„ఏమండీ! ఈలాగున నాటలు మీఱిపోవు చున్నవి! చదువు లీలాగున నయిపోవు చున్నవి! బాలురు స్వేచ్ఛమహా దేవతకుఁ బరమభక్తు లయిపోవు చున్నారు.” అన్నిటికిఁ దోషు, దేశమునందలి కొందఱు బుద్ధిమంతులే, „దేశసేవ” యని, పిల్లలమనస్సులు, చెడఁగొట్టివేయు చున్నారు.” అని, యనేకు లనుగ నారంభించు చున్నారు.

సంవత్సరముపొడుగునను, బిల్లలమనస్సు లీప్రకారముగా, నాటలలోనే మునిఁగిపోవు చుండుటఁ, జూచుచుఁ జూచుచు. నూరకుండుట, యంతగా, లాభకరముగాఁ గానఁబడదు. మీఁదు మిక్కిలి, తలలు పగులఁ గొట్టుకొను చుండుటయుఁ,

గాళ్లును, జేతులును, విఱుగఁగొట్టుకొను చుండుటయుఁ, బిమ్మట వైద్యశాలలకుఁ బోవుచుండుట యుఁ గూడఁ దటస్థించుచుండుట వినుచున్నాముకదా! పిల్లలందఱు నీకాలములో గొలుసుఁ దెంచుకొని పాఱిపోవుకోతులవలెను, బోనులలోనుండి తప్పించుకొనిపాఱిపోవుపులులవలెను పాఱిపోవుచున్నారుగదా!

సంవత్సరపుఁబరీక్షలింక నధమము, మూడుమాసములున్నవనఁగ నైనను, మంచికట్టుదిట్టములు చేసి, యాటలఁ గట్టిపెట్టించివేసి, పిల్లలమనస్సులు, చదువుమీదనే, తదేకదష్టిగా నుండునట్లు చూచుట, మనకు ముఖ్యాంశమై యున్నది. మాయుపాధ్యాయులుగారు, దాము చదువుకొనుచుండుకాలమునఁ, గొందఱుపిల్లలు, మిక్కిలి తెలివిగలవారైనుండుటచేత, డబ్బుల్ ప్రమోషనునుఁ బొందుచుండెడువారట ఈకాలములో, డబ్బుల్ లాస్టు (ట్రిబ్బుల్ షిప్) ప్రమోషనకే, తగిపిల్లలే, ప్రతితరగతియందును, జాలమంది యున్నారని, చెప్పుటకు వేళనయినను, సందేహము లేదుగదా!

ఈవిషయమును బట్టియు, దేశాభివృద్ధి నపేక్షించు మా పైయధికారులకు, వినయపూర్వకముగా, మనవిచేసికొనవలయు ననెడు నాతీర్మానము నామోదించువా రందఱును, జేతు లెత్తవలయు నని ప్రార్థించు చున్నాను.

అందఱు:— హాస్యస్మృతి గలబుద్ధిమంతుఁడ వయిన నీ శ్రీకారముగా, నుపకారము చేయఁ దలఁచితివని, నిశ్చయించి తిము, మే మందఱు మొప్పుకొన కుందుమా? తప్పక యొప్పు

న్నారము. చేతు లెత్తుటయే కాదు. మీరు చెప్పిన
ం, నవశ్యాచరణీయాంశ మగుటచే, గౌరవసూచకముగా,
ను, నిలువఁబడు చున్నారము.

తారక:— మిత్రులారా! మీ కందఱకును, నాయనేక
లు. నేను జెప్పఁదలఁచిన సంగతియంతయు, నింత
ముగించుచున్నాను. నేను జెప్పఁదలఁచిన సంగతులింక
గా, యున్నవి. అవియన్నియు, మీ రందఱుఁ బ్రతిదిన
జూచి, తెలిసికొనుచున్న సంగతులే యగును. మనకు
గాలక యున్నది.

ఆరోగ్య:—ఇంక మనమందఱము, సంత్యప్రార్థన చేసి,
వే కావచ్చును.

అందఱు:—నిలువఁబడి, కన్నులుమూసి కొనుచున్నారు.

ఆరోగ్య:—(నిలువఁబడి, కన్నులు మూసికొని) స్వయం
వును, సచ్చిదానందస్వరూపుండవును, సృష్టిస్థితి
కారణ మహాశక్తిస్వరూపుండవును, సకలచరాచర ప్రపంచ
వెలుపలను, లోపలను, సంపూర్ణముగా నిండియుండు
వును, సర్వలోకారాధ్యుండవును, నగు నోపరమేశ్వరుఁడా!
తాపూర్వకము లగుమావందనములు గైకొనుము. సచ్చిం
జేయుమాప్రయత్నము లన్నియు, సఫలము లగునట్లుగాఁ
దయార్ద్ర హృదయంబున, నాశీర్వదింప, సదా నిన్ను
యపూర్వకముగాఁ బ్రార్థించు చున్నారము.

మాహృదయము లెప్పుడును, ధర్మమార్గములయం
ర్తించు చుండునట్లును, మాచేయుప్రయత్నము ల

